G. Satyanarayana Rao

# మనుషులూ-మమతలూ

తెనుగుదేశంలో పడమట దిక్కుగాపోయే రైల్వే లైనుని చిన్నలైను అని పిలుస్తారు గ్రామీణ ప్రజలు. అంటే బ్రాడ్ గేజి కాదు అని అర్థం. దిక్కు దిక్కులను పరస్పర స్నేహ సంబంధాలతో కలుపుతున్న ఈ రైల్వే లైనును గురించి వెనుకటి రోజుల్లో నయితే, చాలా విడ్డూరంగా చెప్పుకునే వారట. కానీ యిప్పుడందరికీ బాగా తెలిసిపోయినయ్.

బెజవాడనుంచి గుంతకల్లు పోయే మార్గంలో ఒక చిన్న స్టేషను వుంది. ఆ స్టేషనులో చూడడానికేమీ విశేషం లేకపోయినా, అక్కడ రైళ్ళు ఎక్కువ సేపుకూడా ఆగవు. చిన్నలైనుమీద కొత్తగా వెలిసిన స్టేషను అది. స్టేషనుకు ఆనుకుని నాలుగైదు రైల్వేవాళ్ళ యిళ్ళూ, దూరంగా నాగార్జున సాగర్ కంట్రాక్టర్లూ, ఇంజనీర్లూ బంగళాలు కట్టించుకోవడానికి తోలించిన ఇసుకా, సున్నమూ, కాంక్రిట్ తప్ప మరేమీ కన్పించవు. మాచ్‌ఖండ్ జల విద్యుచ్ఛక్తి సరఫరా ప్రణాళిక క్రింద పల్లెలను కలుపుతున్న విద్యుద్దీపాల తీగలు వూరి పొలిమేర దాకా వచ్చి ఆగిపోయినయ్. వాళ్ళూ తలుపులకీ, కిటికీలకీ బాగా ఎర్రరంగు వేసివున్న చిన్న బంగాళాను కట్టుకున్నారు. తీగచుట్టలూ, తదితర సామానులూ, అందులో వేసి, కాపలా వుంచుతారు. సాయంకాలం కాగానే అక్కడ రెండు దీపాలు వెలుగుతాయి. ఒకటి ఎర్రటి ఎరుపుది, మరొకటి తెల్లటి తెలుపుది.

ఆస్టేషనులో మరే విశేషం లేకపోయినా, ఒక చిన్న విశేషం వుంది. ఎప్పుడైనా చిన్నలైను మీద ప్రయాణంచేసి, ఓపికతో చూడదలుచుకుంటే ఎవరైనా చూడవచ్చు. ఆ చిన్న స్టేషను ముందు పెంకుటి ఆర్చిమీదకు ఎగబాకిన జాజి చెట్టు-ఎప్పుడు చూచినా పువ్వులుంటాయి.

ప్రతిరోజు సాయంకాలం ఏడూ పదిహేనుకు పడమటి వేపుకు ఒక బండి వెడుతూంది. ఎనిమిదీ నలభై అయిదుకు తూర్పుకు ఒకబండి, తెల్లవారు ఝామున ఇంకో బండీ పడమటి వేపుకూ వెడుతుంది.

సాయంకాలమై చిరుచీకట్లు ముసురు కుంటూండగానే అన్ని పనులూ వదిలేసి, స్టేషను మాస్టరు జాజిచెట్టు ఎగబ్రాకిన ఆర్చి మీదకు ఎక్కుతాడు ఓపికగా జాజిపూలు కోసి, కాగితంలో భద్రపరుచుకుంటాడు. అతను దిగీ దిగటంతోనే పోర్టరువచ్చి స్థంబానికి వున్న దీపాన్నీ, రంగు రంగుల తన చేతి దీపాన్నీ వెలిగిస్తాడు. పోర్టరు ముసలివాడు. స్టేషను మాస్టరు వయసువాడే. ఆ స్టేషనులో అన్నిపనులూ వాళ్ళే చూసుకుంటారు. స్టేషనుకి మైలు, మైలున్నరపైనే వుంటుంది వూరు. అక్కడున్న నాలుగు రైల్వేవాళ్ళు కట్టించిన యిండ్లలో ఒకటి స్టేషను మాస్టరుది. మరొకటి సూపర్వైజరుది. పదహారేళ్ళ క్రిందట అక్కడ ఒక ప్రమాదం జరిగింది. అక్కడ లైను ఘోరంగా చెడిపోయి నందువల్ల అది బాగు చేయించడానికి రెండుమూడు నెలలపాటు సూపర్వైజరు ఉండవలసి వచ్చింది. అందుకుగాను ఒకే వరుస ఇటుకలతో ఆ యిల్లులాంటిదాన్ని రైల్వే వాళ్ళు కట్టారు. ఇంకో చిన్న

టికెట్టులో బుకింగు క్లర్కు వుంటాడు. ఇంకో దాంట్లో పోర్టరూ.

బుకింగు క్లర్కు పేరు దయాసాగరం. స్కూలు ఫైనలు కాగానే చదువుకు స్వస్తిచెప్పి రైల్వే ఉద్యోగం రాగానే అమితంగా సంతోషించి చేరుకున్నాడు. కొద్దిరోజుల క్రిందటనే అతడికి పెండ్లయింది. అతడికి ఈ వూరు విడిచిపెట్టి ఏదైనా సినిమాలు, పార్కులూ, వున్నవూరులో వుద్యోగం చేద్దామని వుబలాటం. ఇక్కడ వంటరిగా బ్రతుకడానికి జడిసి భార్య నింకా పుట్టింట్లోనే వుంచాడు. రోజూ రైల్వేవాళ్ళను తిట్టుకుంటాడు తనకి తొందరగా ట్రాన్సుఫరు రానందుకు సాయంకాలం వేడి తగ్గిపోయి గాలి చల్లబడి దూరంగా పడమటి వేపున సూర్యుడు అందంగా కృంగిపోతూ వుంటే-తాటి చెట్ల వెనుక, ఇసుక పర్రలలోని సెలయేటి నీళ్ళజాలు కిటికీ లోంచి కనిపిస్తూంటే-ఆర్చిమీద జాజిమొగ్గలూ, పంపు ప్రక్క ఎర్ర గన్నేరుపూలూ చూస్తూంటే-తన భార్యయొక్క కాటుక కళ్ళ సోయగం గుండెల్లో కదలి దాహంతో ఆర్చుకుపో తుంది. అతగాడి మనసు, ఇంకేంతోచదు. తనని తాను తిట్టుకుంటాడు. అదృష్టాన్ని నిందించుకుంటాడు. పడమట ఆకాంశలో నీలవర్ణం అతణ్ణి వున్మత్తుణ్ణి చేస్తుంది. వేరే ఆలో చించకుండా ప్రియురాలికి ఉత్తరం వ్రాయడానికి కూచుం టాడు. పడమటి ఆకాశంలో నీలవర్ణం మాయమై పోతుంది. తాను చూస్తున్న కిటికీలోంచి దూరంగా తాటిచెట్ల వెనుక సెలయేటి నీళ్ళజాలు కనుపించదు. ముసలిపోర్టరు దీపం తీసు కొచ్చి ముందు పెట్టినప్పుడు తలయెత్తి చూస్తే, దీపకాంతి కంటె స్వచ్ఛంగా అతడి నవ్వు కనిపిస్తుంది. దయా సాగరం

సిగ్గుపడిపోతాడు. ముసలిపోర్టరు గంభీరంగా నవ్వుతాడు. ఆల యంలో ధ్వజ స్తంభంమీద చిరుగంటలు గాలికిచేసే చప్పుడు లాగ.

"ఫార్టీ నెను వస్తోంది" అంటాడు.

దయాసాగరం కాగితాన్ని మడిచి, జేబులో భద్రంగా పెట్టుకుంటాడు.

ఎవరో వస్తారు. కిటికీలోంచి చెయ్యి ఇవతలకు పెట్టి టిక్కెట్లు అంటారు.

ముసలిపోర్టరు వెళ్ళిపోతాడు.

మొదటిగంట కొడతాడు గణ గణమని.

నలుగురో అయిదుగురో దిగుతారు.

పదిమందో, ఇంకా తక్కువో ఎక్కుతారు.

టిక్కెట్లు వసూలు చేసుకుంటాడు దయాసాగరం. బండి వెళ్ళిపోతుంది.

చీకటిని చీల్చుకుంటూ వెళ్ళిపోతుంది.

దయాసాగరం జాలిగా బండి కనపడేదాకా చూస్తాడు. బండి కనబడదు. అతడు వచ్చి లోపల కూచుని ఏదో రాసు కుంటాడు ఆఫీసుపని. ఇంటికి వెళ్ళి వంట చేసుకోవాలని తోచి నప్పుడతనికి దిగులౌతుంది.

ముసలి పోర్టరు సింగు చేతిలో రంగుదీపం చిన్నది చేసుకుని సన్నగా ఏదో పాడుకుంటూ వస్తాడు. "సింగూ" అంటాడు దయాసాగరం.

" ఏం సాహిూ ......"

" ఛా ! దీని పాడుగాను ఉద్యోగం ..."

సింగు నవ్వుతాడు. నవ్వీనవ్వనట్లు, వినపడనట్లు పాడుకుంటూ వెళ్ళి పోతాడు. కూజాలోంచి నీళ్ళు వంచుకుని తాగుతాడు దయాసాగరం.

"సాగరం ..." అని పిలుస్తాడు స్టేషను మాస్టరు.

"ఏం సార్!"

"ఫోర్టీన్ ఎంత లేటో కనుక్కో"

"సరే సార్!..."

సాగరం వెళ్ళిపోతాడు.

పంపుపక్కన గన్నేరు చెట్టు పక్కన నులక మంచం వాల్చుకుంటాడు సింగు.

సాగరం బయటకు వచ్చి సిగరెట్టు వెలిగించుకొని నల్లటి ఆకాశం వేపు చూస్తాడు. మిణుకు మిణుకు మనే చుక్కలను చూస్తాడు. ఎక్కడో పేరు తెలీని పక్షి అరుస్తుంది. దూరంగా సిగ్నల్ స్తంభంపైని ఎర్రలైటూ, పచ్చలైటూ.

పచ్చలైటూ,—ఎర్రలైటూ.

చల్లటిగాలి. సన్నగా మరీ సన్నగా, సింగు గొంతు లోంచి కూనిరాగం.

సాగరం మనస్సులో చప్పున మెదులుతాయి. ఆ కళ్ళు, అవే కళ్ళు. నల్లటి సోగకళ్ళు!

సన్నటి ఎర్రటి చిరునవ్వులు చిందించే పెదవులు, చిన్న పెదవులు!

దయాసాగరానికి నవ్వూ యేడుపూ కాని అనుభూతి. లోపలికి వెళ్ళిపోతాడు.

ఇంతలో బెల్ మోగింది.

"హలో! ఆఁ ఆఁ ... ముప్పయి నిమిషాలు లేటా !" సాగరం విసుక్కుంటాడు.

స్టేషను మాస్టరుకి చెపుతాడు.

స్టేషను మాస్టరు కూడా విసుక్కుంటాడు.

ఇంటికి పోయేసరికి తొమ్మిదిన్నరవుతుంది. చిట్టి కాస్తా నిద్రపోతుంది.

పువ్వులు పొద్దుటికల్లా విచ్చుకుంటాయి. ఈ వరకైతే సింగు చేత పంపించేవాడు.

చీకట్లో సింగు పోలేడు.

ఎట్లా — మరెట్లా ?

సాగరాన్ని పంపిస్తే ?

సాగరం ఏమనుకుంటాడు.

పాపం ఇంటికెళ్ళి వంట చేసుకోవాలి కాబోలు. వద్దులే—సాగరం పోవద్దు.

పొద్దున్నే చిట్టి అడుగుతుంది.

" పూలేవి ? రాత్రి ఎందుకు ముందుగా రాలేదు "

ఏం చెప్పాలి ?

సాగరం ఏడీ ?

" సాగరం ..."

" సార్ "

" చూడు లైనెంత ? "

సాగరం అరుస్తాడు. " సింగూ ... ఓ సింగూ " "ఏం సామీ ..." దూరంగా సింగుగొంతు "లైన్ క్లియర్..."

గణ గణమని గంట మోగుతుంది.

స్టేషను బయట వూళ్ళోకి పోయేదారి కాచుకుని రెండు ఒంటెద్దు బళ్ళుంటాయి.

ఎద్దుల మెళ్ళో మువ్వల చప్పుడు.

బళ్ళ వాళ్ళు దీపాలు ముట్టించుకుంటారు.

ఒకడు తత్వ మెత్తుకుంటాడు.

దూరంగా సిగ్నలు స్తంభం మీద ఎర్రలైటూ పచ్చలైటూ.

చెక్క వంగుతుంది.

"సింగూ . ." సాగరం పిలుస్తాడు.

" ఏం సామీ . ."

" బండి వెళ్ళిపోగానే నాతో వస్తావా ?"

" ఉఁ ... "

" అన్నం అక్కడే తిందువుగాని."

" ఉన్నది సామీ."

" ఉంటే అక్కడికే తెచ్చుకో "

ఎవరో—ఒకరో, ఇద్దరో వస్తారు. టిక్కెట్లు తీసుకుంటారు.

దూరంగా చీకట్లో ఎలక్ట్రిసిటీ వాళ్ళుకట్టుకున్న పెంకుటింటిమీద ఎర్రదీపమూ - తెల్లదీపమూ. నాగార్జున సాగర్ కంట్రాక్టరు,కూలీలు యీ బండికే ఇళ్ళకు వెళతారు.

కంట్రాక్టరు వచ్చి సాగరాన్ని పలకరిస్తాడు.

సెంకడ్‌క్లాస్ టికెట్ తీసుకుంటాడు.

బండి వస్తుంది.

బండి పోతుంది.

తలుపులు వేసుకుని తాళాలు బిగిస్తాడు సాగరం. స్టేషను మాస్టరు ఏ ఒంటెద్దు బండిలోనో చోటు చేసుకొని పూళ్ళోకి వెళ్ళిపోతాడు.

సాగరం క్వార్టర్సులోకి వెళ్ళిపోతాడు.

సింగు దీపం చిన్నది చేసుకుని బీడీ ముట్టించుకుని లేస్తాడు. మళ్ళీ వచ్చి పంపు పక్కన, గన్నేరు చెట్టుపక్కన, నులక మంచం మీద పడుకొంటానికి. ఎవరో ఒకరు స్టేష నులో వుంటారు.

స్టేషను మాస్టరు పేరు సత్యనారాయణ. ఈ వరకు క్వార్టర్సులో ఒక్కడే వుండేవాడు. పెళ్ళాం వుందో లేదో అనే సంగతి ఎవరికీ తెలీదు. బిడ్డలు మాత్రంలేరు. ఒండుకుని తినేవాడు. కాని కొద్ది రోజుల క్రితం చెల్లెల్ని తీసుకు వచ్చాడు.

సింగు కనిపెట్టాడు.

అప్పటినుంచీ స్టేషను మాస్టరు అదోరకంగా మారి పోయాడు. కంటస్వరంలో కాటిన్యం కూడా పోయింది.

సింగుది యీ దేశంకాదు. కాకపోయినా చిన్న తనంలోనే యీ దేశానికి వచ్చాడు. అయినా ఇక్కడ స్థిర పడలేదు. దేశ దేశాలు తిరిగాడు. అతడి జీవితమే పెద్ద చరిత్ర, పెద్ద అనుభవం.

మళ్ళీ దేశం చేరుకున్నాడు. పెద్దవాడై పోయినాడు. ఎక్కడో ఉత్తర దేశంలో కూతురున్నదట. ఇంకెవరూ లేరు.

అర్జీ పెట్టుకుంటే గవర్నమెంటు వాళ్ళు కనికరించి నౌకరీ చూపెట్టారు. అప్పటినుంచి ఇక్కడేపడి వుంటున్నాడు.

రెండుపూటలకూ ఒకేసారి వండుకుంటాడు. తన జీవితంలో చూసిన యుద్ధాలనూ, రకరకాల దేశస్థులనూ, అక్కడి ఆడవాళ్ళను, గుళ్ళను గోపురాలనూ ఆదేశంలో కూరగాయలనూ గురించి అందరూ వుత్సాహంతో వినేట్లు చెప్పగలడు. రకరకాల దేశాల పేర్లు చెపుతాడు. ఎన్నెన్నో విశేషాలు చెపుతాడు. కాలక్షేపానికి ఎవరైనా సింగుని పిలుస్తారు. సింగుకి కోకొల్లలు పాటలువచ్చు. ముసలి తనం వచ్చినా.

వాటిని మరచిపోలేదు.

ఉత్తరదేశంలో ఎక్కడో చిన్నపల్లెటూళ్ళో అతని కూతురుందట. ఏవూళ్ళో వున్నదోకూడా అతడు సరిగా చెప్పలేడు. ఉత్తరాలుకూడా వస్తుండవు. ఏ చల్లటి సంజవేళనో కాసేపు అనుకుంటాడు. ఇంకా పట్టలేకపోతే నలుగురిముందూ అనేస్తాడు.

సింగుకి చాలా పాటలువచ్చు.

అతని జీవితంలో లెక్కలేనన్ని అనుభవాలని చూశాడు. ప్రపంచంలోవున్న నైచ్యమంతా చూశాడు. మనుషుల బాధలు, గాథలు ఎన్నో హృదయంలో గుప్తంగా దాచుకున్నాడు. కన్నీళ్ళకి విలువ తెలుసు.?

కష్టాలకి బెదురుపాటులేదు.

అందుకే దయాసాగరం వచ్చిన వారంరోజులకే సింగును ఆత్మీయుడుగా చూసుకోటం నేర్చుకున్నాడు. ఆత్మీయత అనేది పెంచుకోవాలంటే అంత తేలికైన విషయం

కావు. ఉత్తపుణ్యానికి కొందరి ముఖాలుచూస్తే మనకు కష్టం కలుగుతుంది. మనముఖాలుచూస్తే వాళ్ళకు ఎలా అనిపిస్తుందోమరి. కొందరినిచూస్తే హృదయంలో ఆర్ద్రిత రేకెత్తుతుంది. వీటన్నిటికీ కారణకార్యసంబంధం వెతుక్కోవటంలో అర్థంలేదు. మనుషుల చిత్రమైన ప్రవృత్తి అది. కోకిల ఎందుకు పాడుతుంది, చందమామ ఎందుకు చల్లదనం కలిగిస్తాడు. చెట్లు ఎందుకు చిగురిస్తవి. పువ్వులు ఎందుకు వికసిస్తవి-అనే విషయాలను తెలిసికోవాలంటే ఎలా మనకు అసంభవమో, మనుషుల యీ చిత్తప్రవృత్తిని పరిశీలించవలెనన్నా కానిపని.

సింగు ఒక్క దయాసాగరానికే కాదు ఆప్తుడు. ఆ చిన్నగ్రామంలో అతడు మనుషులందరి హృదయాలను చూరగొన గలిగాడు. ఉత్తర దేశంలో కుగ్రామపు నది ఒడ్డున గడపిన బాల్యం ఎప్పుడేనా అతడికి గుర్తొస్తుంది, వెదురుపొదల ఒడ్డున భయం అనేది లేకుండా వేసవికాలపు మధ్యాహ్నపువేళలందు, శీతాకాలపు ఉదయపు వేళలందు, పాలవెన్నెల కురిసే రాత్రులందు, ఆ నదిఒడ్డున ఇసుకకుప్పల మీద పిచ్చిగా తిరిగేవాడు. ఎందుకు తిరుగుతున్నట్లు? అని ప్రశ్నించుకుంటే అతనికి సమాధానం దొరకేదేకాదు. అలానే తిరుగుతుండేవాడు. నదిఒడ్డున చిన్న గుడిసె. వర్షాకాలంలో నదిలోకి బాగా నీళ్ళు వచ్చినప్పుడు గుడిసెను ఆనుకుని ప్రవహించేవి నీళ్ళు. ధైర్యంగా నదిఒడ్డున అవతల గ్రామానికి, ఇవతల గ్రామా

నికి రోజూ తిరుగుతుండేవాడు. చెరుకుపంట పండేది. తండ్రికి చిన్నకొట్టువుంది. చెరుకురసం అమ్మకోవటం, చెరుకును ఇతరవూళ్ళకు పంపించటమూ, చూచుకుంటుండేవాడు. నది ఒడ్డునే పెద్దమామిడిచెట్టువుంది. ప్రొద్దస్తమానం చెట్టు క్రిందనే గడిపిన బాల్యపురోజులు తలచుకొని జీవితంలోని యీచిత్రగతులనుచూస్తే అతడికి వొక్కొక్కసారి విపరీతమైన ఆశ్చర్యం కలిగేది. తల్లీ దండ్రీ- దిప్పకాయని చిన్నతనంలో పట్టించుకునేవాళ్ళుగారు. యుద్ధంవచ్చింది! యుద్ధంవచ్చి బంగారపు రోజులని మండింపచేసింది. చేపలు పట్టుకుని, మామిడికాయలు కొట్టుకొని, ఒళ్ళు మొద్దుబారేదాకా నీళ్ళల్లో యీదులాడుతూ గడిపేసే తనకు పాడురోజులు వచ్చినయ్.

ఎక్కడ చూసినా ధరలు మండిపోయినయ్. పూటకు తిక్కాణా లేనివాళ్ళుకూడా కొందరు యిట్టే డబ్బులు సంపాదించారు. తండ్రికి వున్న ఒక్క యకరం చెరుకుతోట పోయింది. నది ఒడ్డున మిలటరీ కాంపు పెట్టారు. తండ్రి మారిపోయిన పరిస్థితులలో మారలేక, దురదృష్టాన్నీ భరించి ఎదిర్చలేక అమృతసరం పారిపోయాడు. ప్రొద్దస్తమానం తాను చేపలు పడుతూనే వుండేవాడు. చీకట్లు ఇంకా విచ్చుకోకముందే పోయి వెదురుపొదల్లో గడపాలి. వలవేసి, చీకట్లు మళ్ళీ లోకాలను ముసురుకునేదాకా, చేపలుపట్టే ధ్యాసతప్ప వేరేధ్యాస వుండేదికాదు. మిలటరీ క్యాంపు వాళ్ళకు ఎన్ని గొర్రెలైనా చాలటంలేదు. ఎన్ని కోళ్ళయినా చాలటంలేదు. ఎన్నిచేపలు పట్టిఇచ్చినా చాలటం

లేదు. డబ్బులు బాగానే సంపాదించుకున్నాడు. క్యాంపు అక్కడినుంచి ఎత్తివేసి వెళ్ళిపోయేప్పుడు ఎవరైనా చేరే వాళ్ళుంటే చేరవచ్చు అని చెప్పారు సింగుకి. తల్లికి చెప్ప లేదు సింగు. వాళ్ళు బట్టలిస్తారు. వాళ్లు తిండిపెడతారు. పైన జీతంకూడా యిస్తారు. ఎందుకు పోగూడదు, అదృష్ట మనేది వూరికే కూచుని కలలుకంటే లభించదు. దానికి ధైర్యం చెయ్యాలి. వెళ్ళిపోవాలి. సింగు మిలిటరీ వాళ్ళలో చేరాడు.

మొట్టమొదటిరోజులు చాలా ఉత్సాహంగా గడి పాడు. తరువాత ఒకరోజు గడచి, ఒకరోజువచ్చి, కాలం జరిగిపోతుంటే ఆతడికేదో బ్రతుకులో వెలితి కనపడేది. ఇవాళ ఒకవూరు. రేపు ఇంకొకవూరు. గ్రూపులోనివాళ్ళ నైచ్యమంతా చూసి అతడి ఒళ్లు కంపరంతో కుంచించుక పోయేది. దేశం వదలికూడా పోవలసివచ్చింది. సముద్ర ములో ఓడలో, పోతుంటే ఇంతసాహసం తనకెందుకు కలి గిందా అని ఆతడు దిగులుపడేవాడు. సముద్రంలో సూర్యా స్తమయ సూర్యోదయాలు, అతడికి అపూర్వానుభూతులు తెచ్చిపెట్టేవి. డెక్ మీద రాత్రిళ్ళు మిణుకు మిణుకుమనే నక్షత్రాలక్రింద గ్రూపు సోల్జర్లు పిచ్చి పిచ్చిపాటలు పాడు కుంటూ తాగుతూ పేలుతూ సంతోష పడుతుంటే అతడికి యేడుపొచ్చేది. దూరంగా యెక్కడో, ఏ మూలో, అంద మైన దేశముంది. ఆ దేశంలో వెదురుపొదల నడిబడ్డున తన గుడిసెవుంది. ఆ గుడిసెలో తన తల్లి హృదయభారంతో

యేడుస్తుంటుంది. తల్లి గుర్తొచ్చి నప్పుడు ఎలాగైనా పారి పోదామనిపించేదతడికి. పట్టుపడితే చాలా ప్రమాదమని, వాళ్ళు చెప్పుకునే కథలవలన అతడు గ్రహించాడు. ఒకవేళ తప్పించుకున్నా యీ అనంత గంభీర జలరాశిని తానెలా గడచిపోగలడు. తన జీవితము కొరగాకుండా పోయింది. తన తల్లిని తాను యిక మరచిపోవాలి. తప్పదు. వెదురుపొదలు మరచిపోవాలి. వంపులు వంపులు తిరిగే నదిని మరచి పోవాలి. ఇదే జీవితానికతుక్కుని పోవాలి.

వెన్నెల రాత్రులు నదిఒడ్డును తలచుకుని అతడు కుమిలిపోయేవాడు. పురాస్మృతు లతణ్ణి పూర్తిగా విచల తుణ్ణి చేసేవి.

అలా అతడు ఆరు సంవత్సరాలు గడిపాడు. ఈ ఆరు సంవత్సరాలలో అతడు పూర్తిగా మారిపోయాడు. ఎక్కడ చూసినా యుద్ధ భయం. ప్రజలకు సుఖశాంతులు ఏ దేశానా లేవు. ఇటునుంచి వీళ్లువచ్చిపడుతున్నారనో. అటునుంచి వాళ్ళు చొచ్చుక పోతున్నారనో ఎప్పుడు వార్తలందుతుండేవి. తాను యుద్ధభూమిలో వుండేటటువంటి దురదృష్టకర జీవితా న్నుండి మాత్రం తప్పించుకున్నాడు. వార్తలను చేరవేసే పనిమాత్రమే అతడికి దొరికింది. ఆ దళంలో అతడు పని చేస్తుండేవాడు.

ఎన్నెన్నో అందమైన దేశాలు చూశాడు. ఎన్నెన్నో వింత వింత రుచులు చూశాడు. వివిధరకాల ప్రజలను, వారి ఆచార వ్యవహారాలను, చూశాడు. అందమైన ఆడవాళ్ళూ,

మద్యం అమ్మకునేఇండ్లూ, అతడి చూపులనుండికూడా తప్పించుకోలేక పోయాయి. యువ్వనం పూర్తిగా అతణ్ణి ఆక్రమించుకున్న తర్వాత ప్రపంచంలోని నైచ్యం అతడూ చవిచూశాడు.

ఎంతోమంది కొత్తవ్యక్తులతో అతడికి పరిచయమైంది. తెలుగుదేశంనుంచి వచ్చినదళం ఇద్దరితో బాగా స్నేహం కలిసిం దతడికి. దూరదేశంలో కష్టానికి సుఖానికి వాళ్ళే అయినారు సింగుకు.

ఆరేళ్ళు గడచిన తర్వాత దేశం చేరుకుంటే, అతడికి జీవితంలో ఏమీ మిగల లేదనిపించింది. తమ గుడిశె రూపు మాసిపోయింది. మనుషులుకూడా అందరూ మారిపోయారు. 'సింగు' డబ్బు మూటగట్టుకొని ఎవరిని సుఖసంతోషాలతో ముంచివేదామని వచ్చాడో,- ఆతల్లిలేదు. అతడికి జీవితమే లేదనిపించింది. ఆవూళ్ళో వుండలేకపోయాడు. తనకు కష్ట సుఖాలలో తోడునీడైన మిత్రులకోసం తెలుగుదేశం వచ్చాడు.

ఇక అతడు ఎక్కడికీ పోలేకపోయినాడు. చిన్న 'టీ' దుకాణం పెట్టుకుని కొన్నాళ్ళు అక్కడే గడిపాడు. మళ్ళీ రెండు సంవత్సరాలైనతర్వాతనే దేశం వెళ్ళాడు.

వూళ్ళోవాళ్ళు పట్టుబట్టి ఓచిన్నదాన్ని జోడుచేసి ఒక ఇంటివాణ్ణి చేశారు. మళ్ళీ కొన్నాళ్ళపాటు అతడిజీవితం సుఖంగానే గడిచిపోయింది. నది ఒడ్డున చెరుకుతోటలో పనిచేయటం, వెదురుపొదల్లో గడపాతి చాపలు పట్టుకోటం

ఈడుజోడైన చిన్నది జీవితానికింత వెలుగునూ వెన్నెలను కూర్చటం, అతడి జీవితానికింత సుఖశాంతులను ప్రసాదించినయ్.

కాని ఆట్టేకాలం అతడికి యీ రకమైన జీవితం సుఖకరం కాలేకపోయింది. దేశంలోని పరిస్థితులన్నీ గిట్టటంలేదు. మళ్ళీ యుద్ధంవచ్చే సూచనలు కన్పిస్తున్నాయి. ఊళ్లో కూడా అతడికి పలుకుబడి తగ్గిపోయింది. జీవితం లోకాన్ని అన్యాయమైన సంఘటనలలోపడి, అతడు మానసికంగా కృంగిపోయాడు. తన చిన్నదాని మీదనే తనకు ఓ విధమైన అవిశ్వాసం ప్రబలింది. దానికి బలమైన కారణాలు అతడు వూహించిన వూహాలకు రూపాలు దిద్దుకొని, బలపరచుకున్నాడు.

అతడికి ఓ కూతురు పుట్టింది.

లోకసహజత్వానికి విరుద్ధంగా అతడు సంతోషించచలేకపోగా పగజెందాడు. అతడు కొన్నాళ్ళు గడిపి యుద్ధంలోకి వెళ్ళిపోయాడు. అతడికి క్షణ క్షణం తనభార్య తనకు చెప్పలేని ఘోరం చేసింది అనే విషయమే మనసులో ప్రబలేది. అంత అవిశ్వాసాన్ని అన్యాయాన్ని అతడు సహించలేకపోయాడు. ఇకమళ్ళీ జీవితంలో ఆ అమ్మాయి ముఖం చూడకూడదని, ఒట్టు వేసుకొన్నాడు.

కొద్దిరోజుల్లోనే మరచిపోగలిగాడు. ఈసారి అతడు జీవితంలో ఎంత నీచం అనుభవించాలో అంతనీచం అనుభవించాడు. మానసిక అశాంతిని వదుల్చుకుందామని తాగటం

కూడా నేర్చుకున్నాడు. మనిషి చెడటానికి యీ ప్రపంచంలో ఎన్నిరకాలైన చెడుమార్గాలున్నాయో అన్నిటిలోను సంచరించాడు. రకరకాల శరీరమార్దవాలను రకరకాల రుచుల ఆసవాలను అనుభవించాడు. విపరీతమైన శరీరలాలసత్వము, క్రౌర్యము పెంపొందించుకున్నాడు.

అతడి-ఆరోజులలోని శరీరలాలసతకు, ఒకసారమంటూ వుండేదికాదు. ఈ దాహం తీర్చుకునేందుకు అతడు ఎన్ని రకాల ప్రయత్నాలు జరిపినా ఆ దాహం తీరేదికాక, ఎక్కువవుతుండేది.

సోల్జర్ల దళంలో నిజమైన సోల్జరనిపించుకున్నాడు. విషపూరితమైన అతడి మనస్సు స్వదేశాన్ని, స్వపరివారాన్ని చాలారోజులవరకు మరచిపోగలిగింది కాని., యుద్ధం పూర్తి అయిన తర్వాత స్వదేశానికి తిరిగిరావలసి వచ్చింది. నది ఒడ్డున ఇవాళ చెరుకుతోటలు లేవు. మామిడి చెట్లూలేదు. తనవూరు చిన్న బస్తీగా మారిపోయింది. తన భార్య దేశకాల పరిస్థితులకు తట్టుకోలేక కాలంలోకి వొరిగిపోయిందని తెలిసింది. అతడు ఆ విషయంపై ఎక్కువగా ఆలోచించలేదు. ఎవరినీ అడగలేదు. కూతురు సురక్షితంగానే వుందని తెలిసింది. మామూల్గాలుగా, పరాయివాడివలె, దూరపు చుట్టంవలె ఒక రోజునపోయి కూతుర్ని చూసివచ్చాడు.

ఎక్కడికి పోవాలి? అన్న పెద్దప్రశ్న ఎదురైంది అతడికి. ఉన్న కొద్దిడబ్బులో కొంత కూతురి రక్షణక్రింద ఇచ్చేశాడు. మళ్ళీ తెలుగుదేశానికి వచ్చాడు.

అప్పటికి అతనిలో శారీరక బలం తరగి పోయింది. కళ్ళు గుంటలు పడ్డాయి ముఖంమీద ముడతలుకూడ కన పడ్డాయి. ఇంకా మిలిటరీలో పనిచేసినవాడు కాబట్టి తట్టు కోగలిగాడు. తెలుగుదేశంకూడా మారిపోయింది. ఒక మోస్తరు పట్టణాలు పెద్దపట్టణాలు అయిపోయినయ్. చిన్న చిన్న పల్లెలు బస్తీలుగా మారిపోయినయ్.

టీ బంకు పెట్టుకున్నాడతను. వెనుకటి జీవితాన్ని పూర్తిగా మరచిపోలేకపోయాడు. అంత విశృంఖలంగాక పోయినా, అలాటి జీవితమార్గాన్ని నడిచాడు.

దేశంచాలా మారిపోయింది. కాలంకూడా చాలా మారిపోయింది. పరిస్థితులు మారిపోయినయ్ అతడిలోనిశక్తి యుక్తులన్నీ క్రమంగా తరిగిపోయినయ్. అతడి కెవరో చెప్పారు. ఇదివరలో యుద్ధంలో పనిచేసి వచ్చినవాళ్ళకు చిన్నచిన్న ఉద్యోగాలు యిస్తారని.

అతడు కొంత ప్రయత్నం చేశాడు. తత్ఫలితంగాఅత డికి ఈ ఉద్యోగం చూపిబెట్టారు. అతడు సంతోషించాడు. తాను టీ బంకుమీద ఇంతకంటె ఎక్కువ సంపాదించినా సుఖపడలేకపోతున్నాడు. తనజీవితానికి ఇకకావలసిందేమిటి! ఎవరికోసం తానుకష్టపడాలి? ఎవరికోసం డబ్బు కూడబెట్టాలి? ఎవరికోసం బ్రతకాలి?

ఆ వూళ్లో అతడు పోర్టరుగా చేరిపోయాడు. రోజుకో పదిసార్లు ఆ వూరిపేరును వుచ్చరిస్తూ రైలు పెట్టెలవెంబడి అరవటమూ పదేపదే గంటలుకొట్టటమూ, అందరితో మంచి

వాడనిపించుకోని శాంతంగా బ్రతకటమూ ఆతడి చరమ జీవితానికి అలంకార ప్రాయాలుగా అయినాయ్.

## 2

వెన్నెలచాళ్ళు కుట్టి కురుస్తున్నది. ఆకాశంలోఅక్కడొక మబ్బు అక్కడొకమబ్బూ తప్ప నిర్మలంగా వుంది. దూరంగా ఇసుక కుప్పలూ, సున్నపు కుప్పలూ, రాళ్ళ గుట్టలూ, సగం సగం నిర్మించిన కట్టడాలు వెన్నెల్లో మెరసి పోతున్నాయ్. దయాసాగరం స్టౌ వెలిగించి నీళ్ళు పడేశాడు.

సగం చదివిన తెలుగు నవల క్యాంప్ కాట్ మీద అలానే తెరుచుకుని మూసిపెట్టబడివుంది. దయాసాగరం మనస్సు ఆ నవల వైపుకే మొగ్గుతున్నది. జీవితంలోవ్యక్తుల మీద పుస్తకాల ప్రభావాన్ని అతడు బాగా యెరుగును. అతడు ఎక్కువ చదువుకోననీ, కనీసం ఒక డిగ్రీ అయినాసంపాదించక పోయినా ఎన్నో పుస్తకాలు చదివాడు. కొంత కాలం అతడికది మానలేని దురలవాటుగాకూడా పరిణమించింది.

వ్యక్తులలోని బలహీనతలని కొంతమటుకు పుస్తకాలు ఎత్తి చూపుతవి. ఆ బలహీనతలని అవి 'క్యూర్' చెయ్యాక పోవచ్చు. కాని ఒక మంచి పుస్తకం చదివితే మిగిలేది- ఆ వ్యక్తుల ప్రవర్తనలోని ప్రభావం. చదువుకున్న వాడిమీద స్ఫుటంగా కనపడుతుంది. ఒక విధమైన ఆత్మపరిశీలన అలవడుతుంది. దానివలన కొంత మేలుకూడా వుంది.

అతడు చదివే నవలలో కొన్ని విచిత్ర సంఘటనల మధ్య కథానాయకుడు అబద్ధం ఆడననే నిర్ణయానికి వస్తాడు. ఆ క్షణంనుంచీ అతడి జీవితంలో అడుగడుగునా ఘర్షణ తప్పదు. ప్రేమించిన వాళ్ళనుండి దూరమవుతాడు. ఆప్తుల నుండి విడదీయబడతాడు. అ నవలలో రియాలిటీ ఎంత వుంది అనికాదు, మనకుకావలసింది. హృదయాన్ని ఎంతమటుకు కదిలిస్తున్నది. సాహిత్య ప్రభావం మేధకికాదు- హృదయానికి.

'దయాసాగరం హృదయం ఒక ఉద్వేగంతో కొట్టు కుంటున్నది- అది చదవటం మొదలుపెట్టినప్పటినుంచీ.

తన జీవితంలో తాను- చేసిన తప్పులను ఎవరితో నైనా చెప్పుకోగలుగుతే బాగుండును. కాని ఎవరికిచెప్పాలి? తన బలహీనతలను, పిరికితనాన్ని ఎవరిముందు వెల్లడిచేసుకో వాలి. సుగుణముందు వెల్లడిచేస్తే, సుగుణ భరించలేక పోవచ్చు. ఒక సత్యం ఒక్కొక్కప్పుడు కలిగించేబాధ వెయ్యి అబద్ధాలు కూడా కలిగించలేక పోవచ్చు. ఒక నిజం పది అబ ద్ధాల కంటే ఎక్కువ అనర్థాన్ని సృష్టించవచ్చు. ఒక్క అనృతం అమృతంలా పనిచేయవచ్చు. ఎప్పటికైనా సత్యం జయిస్తుందనీ, ధర్మానికే విజయం చేకూరడం తథ్యమనీ. పుస్తకాలలో వ్రాసివుండవచ్చు. పెద్దవాళ్ళు చెప్పవచ్చు. నిత్య జీవితంలో ఆ సత్యం అంత సమంజసముగా కనబడటం లేదు దయాసాగరానికి.

ఇదంతా ఆ పుస్తక ప్రభావమే దయాసాగరంమీాద.

బుట్టలోంచి నాలుగు వంకాయలుతీసి చాకుతో కొయ్యటానికి కూచున్నాడు. రోజు రోజుకీ తన జీవితగతి చూస్తుంటే చిత్రంగా వుంది దయాసాగరానికి. ఇలా తాను వంకాయలు కోసుకుని కూరచేసుకుని కష్టపడటమేమిటి? సుగుణను ఇక్కడకు ఎందుకు తెచ్చుకోకూడదు? సుగుణవస్తే తనకుఎంతసంతోషం? తన మనస్సుఎప్పుడూసుగుణని గురించి ఆలోచిస్తుందేం? సుగుణ కూడా తనలానేతననిగూర్చి ఆలోచిస్తుంటుందా! సుగుణ ఎలా వుంటుంది! యీ వెన్నెలలో-

సింగు ప్రవేశించాడు.

"బాబుగారూ ఇంకా అన్నం తయారు చేసుకోరే?"

పది నిమిషాల్లో అయిపోతుంది.

సింగు స్తంభానికి ఆనుకుని కూచున్నాడు.

దయాసాగరం అన్నందించి కూరగిన్నె పడేశాడు.

"అమ్మగారిని తీసుకరాండి సామీ! యీ కష్టం వుండదు" అన్నాడు సింగు.

దయాసాగరం నవ్వాడు.

"నవ్వటాలకుకాదు సామీ. ఎక్కువనాళ్ళు ఇలా వుండకూడదు."

"ఏం సింగూ వుంటే?"

"అయ్యా చనువుకొద్దీ చెప్పుకుంటాను. ఏమీ అనుకోవద్దు. జీవితంలో అన్ని అనర్థాలకి మూలమైంది వయస్సు."

దయాసాగరం సిగ్గుపడ్డాడు. కోపం కూడా వచ్చింది. తానంత చనువుగా మాట్లాడటంవల్ల సింగు అలా ఉనగలిగాడని బాధపడ్డాడు.

"సామీ, ఎవరో తప్ప మనుషుల్లో అంతా చెడ్డవాళ్ళే' దయాసాగరం దానికి ఊఁకొట్టలేదు. నూనె వేసి గిన్నెలో పోపుపెట్టటంలో మునిగిపోయాడు.

సింగు చెపుతున్నాడు.

"ఈ జీవితంలో లెక్కలేనన్ని చూశాను. మనుషుల్లో ఎక్కడా మంచితనం మాత్రమే లేదు. ద్రోహబుద్ధి కూడా ఎక్కువగానే వుంది. నేను ఇప్పుడు నా బ్రతికిన వెనుకటి రోజులు తలచుకుంటే యేడవాలనిపిస్తుంది."

దయాసాగరానికి ఆ చర్చ పొడిగించటం ఇష్టం లేక పోయింది. ఆలోచనలైనా ఎప్పుడూ ఒకే మార్గాన వుంటే ఒంటికి జబ్బుచేస్తుంది.

"స్టేషను మాష్టారుగారింట్లో పెండ్లి యెప్పుడు సింగూ?" అని అడిగాడు.

సింగు అన్నాడు. "లగ్గమెప్పుడో సరిగా తెలీదుసామీ! అయినా దగ్గర్లోకే వచ్చింది. అయ్యగారు రేపు వూరెళతారేమో."

"నీతోటి అన్నారా ?"

"లేదుసామీ. నిన్న వాళ్ళింటి కెళ్ళినప్పుడు అనుకుంటున్నారు."

దయాసాగరం కూరకూడా దించాడు.

హరికేన్ లాంతరు ఎత్తుగా పెట్టాడు.

భోజనానికి కూర్చున్నాడు.

సింగు బయటినుంచి కేకపెట్టాడు.

"అయ్యగారింటిదాకా పోయిరానా ?"

"ఎందుకు సింగూ ?"

"కనుక్కొని వస్తాను."

"వద్దులే--అంతదూరం ఎక్కడ వెళ్తావు"

సింగు మాట్లాడలేదు.

దయాసాగరం లేచి బయట పక్క పరచుకున్నాడు.

పడుకుని సిగరెట్ ముట్టించాడు

సిగరెట్ ముట్టించినప్పుడల్లా అతడికి తల్లి గుర్తొస్తుంది

ఆమె దృష్టికి సిగరెట్ కాల్చడం ఒక దుర్వ్యసనం. ఆమాట అతడికెన్నోసార్లు చెప్పిందామె.

"అబ్బే! నాకసలు గిట్టదమ్మా, ఆ వాసనే!" అనేవాడు.

"నీ సంగతి కాదురా?" అనేది ఆమ్మ. చాలాసార్లు మానాలని ప్రయత్నించాడు. కాని ఆ అలవాటును పూర్తిగా వదల్చుకోలేకపోయాడు. ఎప్పుడైనా తలకాయ బాగా వేడెక్కి, హృదయంలో ఇది విరుద్ధమని నిర్ణయించరాని బాధుదయించినప్పుడు అతడు సిగరెట్లు వెలిగించటం అలవాటు చేశాడు.

అదే వొక అలవాటుగా పరిణమించింది.

నిద్రరావటంలేదు.

"సింగూ?"

"ఏం సామీ!"

"ఏదేనా ఒక పాటపాడుదూ"

"ఆ జన్మ వేరుసామీ! మళ్ళీ ఇంకారాదు. అనుభ వించాల్సిన సుకం అంతా అప్పుడే అనుభవించాను. ఆ నది ఒడ్డున వెదురు పొదల్లో చిన్నతనమేకదా! అసలు భయమనేదేవిరగను. వెదురుగడకిపాతివలవేసేవాణ్ణి. చాపలకి కూడ దొంగతనం తెలుసుసామీ!"

"అందుకని అక్కడేకూచునేవాణ్ణి. దూరంగా నక్కలు అరుస్తుండేవి. అవేం పూలో మత్తుగా- ఆవాసన చాలా కారంగా వుండేది. నీళ్ళజాలుచేసే చప్పుడు, అప్పుడో పాము, అప్పుడో పాము నీళ్ళలో తేలుతూ కన్పించేది. అయినా భయమేసేదికాదు. ఓకసారి గుట్ట యెక్కాను. నాకాళ్ళ కింద, రాళ్ళకింద ఏదో చప్పుడైంది. చూద్దునుగదా బారెడు పొడుగు పాము చరాచరా పోతున్నది. కొద్దిగా భయమైంది. ఏం పాములేసామీ! సెబాసైన పాము. అయినా ఎప్పుడూ పోతూనే వుండేవాడిని. ఏ నాలుగింటికో మూడింటికో ఇల్లు చేరుకునేవాణ్ణి"

"సింగూ?

సింగు ఆపేశాడు.

"ఏదేనా పాట పాడుదూ" మళ్ళీ అడిగాడు దయా సాగరం.

సింగు గొంతుసవరించుకున్నాడు.

"నీకు నీవారు లేరూ, నాకు నావారు లేరు.

మరుమల్లె తోటలోను మంచినీళ్ళ భావికాడ.

మల్లెపూల తెప్పగట్టీ

తెప్పమీద తేలిపోదాం పదరా
ఛల్ మోహనరంగా..."

దయాసాగరానికి నవ్వొచ్చింది.

సింగు ఇంకా పాడుతున్నాడు.

శృంగార ఘట్టాల్లోపాడుతున్నాడు.

"సింగూ?

"ఏం"

"ఇన్నిపాటలు ఎలా నేర్చుకున్నావు ?"

"వీరాసామి అని గ్రూపులో తెలుగు వాడుండేవాడు. వాడివలన మొదలునాకు తెలుగువచ్చింది. వాడు ఏ వే వో పాటలు పాడుతుండేవాడు. మాకు అర్థం కాకపోయినా వింటూ వుండేవాళ్ళం. నేను యీ దేశం వచ్చి ముప్పై సంవత్సరాలపై గా అయింది సామీ."

అరుగుమీద చెంబుతో నీళ్ళూ, దీపమూ తెచ్చి పెట్టాడు సాగరం. ఇందాక సగం చదివి మూసిన పుస్తకం చదవటానికి తెరిచాడు. ఒకమూల సింగు పక్కపరచుకొని పడుకున్నాడు.

గంటపైగా చదివాడు దయాసాగరం పుస్తకంపూర్తి కాలేదు. తెరచివున్న కిటికీలోంచి వెన్నెల పక్కమీద పారాడు తున్నది. మధ్య మధ్య కాకులు తెల్లవారిందనుకుని

గోల గోలగా అరుస్తున్నాయి. దయాసాగరం మంచినీళ్ళు తాగుదామని లేచి కిటికీలోంచి చూశాడు.

దూరంగా ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటువాళ్ళ లైట్లు వెలుగుతున్నాయి. సగం సగం ఇటుక కట్టడాలు వెన్నెట్లో మెరిసి పోతున్నాయి. పక్క-మీదికి దృష్టి సారించాడు దయాసాగరం. పాలనురుగులావుంది. ఒక్క-సారిగా సుగుణ గుర్తు వచ్చింది. అతడినరాల్లో చెప్పలేని ఆవేశం పొంగిపోయింది. తీయటి బాధ శరీరాన్నంతా అలుముకున్నట్లైంది.

సుగుణ ఏంచేస్తుంటుంది. అమాయకంగా నిద్రపోతూంటుందా ? ఆ విశాలమైన కాటుక కళ్ళు ముకిలించుకుని ఎంతఅందంగా వుంటాయో! రాసిపోసుకున్నట్లుగా, సౌందర్య మంతా సుగుణ కళ్ళలో ఆవాసం చేస్తుంటుంది. ఆ కళ్ళను నిద్రలో ముద్దుపెట్టుకుంటే బావుండును ... దయాసాగరం దీపం చిన్నదిచేశాడు.

జీవితంలో ఏమిటో వెలితి తనను ఆక్రమించు కుంటు న్నది. తాను కొన్నాళ్ళక్రిందట కొద్దిరోజుల్లో యీ బాధ లన్నీపోయి సుఖశాంతులు లభిస్తవనుకున్నాడు. సత్యవతిని మరచిపోగలిగితే జీవితంలో సుఖం లభిస్తుంది అని అను కున్నాడు.

సత్యవతిని తాను పూర్తిగా మరచిపోలేకపోయినా ఆ సమస్య పరిష్కరించబడ్డది. తరువాత తనకు పెండ్లయింది. సుగుణను పెండ్లిచూపులకుపోయి చూసినప్పటినుంచీ, అతడికి తనజీవితంలో ఇంత వెలుగూ, వెన్నెలా లభించగలదను కున్నాడు. దయాసాగరానికి తండ్రిలేడు. ఒకఅన్నవున్నాడు.

ఒక చెల్లెలువుంది. అన్న ఎలానోకష్టపడి బి. ఏ. దాకా చదువుకున్నాడు. చెల్లెలిపెళ్ళికై చాలా కష్టపడాల్సివచ్చింది. దయాసాగరం స్కూలుఫైనల్ ప్యాసుకాగానే అన్న ఒకరీతి ననుసరించి కాలేజీలో చేరి చదువుకోమన్నాడు. కాని దయాసాగరం ఇష్టపడలేదు. తన చదువుకన్నా చెల్లెలి పెళ్ళి చేయటం ముఖ్యమని అతడి భావన. టైపూ షార్టుహేండూ నేర్చుకుందామని ప్రయత్నం చేశాడు. కొంతలో కొంత కృతకృత్యుడైనాడు. రెండు సంవత్సరాలు ఉద్యోగందొరకక వూరికినే వుండాల్సివచ్చింది. ఆ రెండు సంవత్సరాలలో విపరీతంగా జనరల్ నాలెడ్జి సంపాదించుకున్నాడు. ఎన్నోపుస్తకాలు చదివాడు. అయినా ఆ రెండు సంవత్సరాలూ అతడి జీవితంలో చీకటిరోజులు. ఏమీతోచేదికాదు. ఇంటాబయట కూడ అతడికి అశాంతే ఎదురయ్యేది.

ఆ రోజుల్లోనే అతడికి సత్యవతితో పరిచయమైంది.

సత్యవతి ఓ ఎలిమెంటరీ స్కూలు మేష్టారమ్మాయి. స్నేహితులు ఓ రూము తీసుకుని చదువుకుంటుంటే రోజూ ఆరూముకి పోయేవాడు దయాసాగరం. ఆరూము అప్‌స్టెయిర్స్ మీదవుండేది. ఆ ఇంటిపక్కనే ఓ చిన్న పెంకుటిట్లో వుండే వాడు ఆ ఎలిమెంటరీ స్కూలు మేష్టరు. స్నేహితులకోసమే పోయే దయాసాగరం కొద్ది రోజుల్లో ఆమాట మరచిపోయి సత్యవతి కోసమే వెళ్ళేవాడు. అప్‌స్టెయిర్స్ గదిబయట వరండాలో వేపచెట్టుక్రింద కుర్చీవేసుక కూర్చుంటే పక్కింటి వాళ్ళు నీళ్ళు తోడుకోవటం కనిపిస్తుంది.

ప్రొద్దున లేచింది మొదలు సాయంకాలం అయ్యేదాకా

సత్యవతి పనిచేస్తూనే వుండేది. పైన స్కూలుకు పోయి చదువుకుంటూండేది. ఇంకో చిన్న చెల్లెలు కూడా వుంది. ప్రొద్దున్నే లేచి వంటచేసి, తండ్రినీ, చెల్లెల్ని, స్కూలుకు పంపించి తాను తిని పదిగంటల లోపునే స్కూలుకు పోవాలి సత్యవతి.

మళ్ళీ సాయంకాలం తాను ముందువచ్చి కాఫీ పెట్టి వుంచాలి. రోజూ ఆ పిల్లనే ఒళ్ళంతా కళ్ళుచేసుకుని చూచేవాడు దయాసాగరం. ఆమె ప్రతి అడుగునీ, కదలికనీ పరిశీలించేవాడు. చిత్రమయిన పరిస్థితులలో మేష్టారుకీ, దయాసాగరానికీ పరిచయమైంది. ఆ మేష్టారు మేనల్లుడు వచ్చాడు. ఒకరోజు, ముందు అతగాడితో పరిచయమయింది అతడు దయాసాగరంకి సమవయస్కుడు. అతనే ఒకరోజు వాళ్ళింటికి తీసుకువెళ్ళాడు.

మేష్టారు ముందు కుశల ప్రశ్నాది కాలంటూ పరిచయ ప్రసంగం కొంత నడిపి, సంభాషణను ఒక దిక్కులోకి తిప్పాడు.

అన్నదమ్ములెంతమంది ? అమ్మా నానా వున్నారా? అనే విషయం నుంచి మీ గోత్రమేమిటి నాయనా? అనేదాకా ప్రశ్నలు వేశాడు.

దయాసాగరానికి కొంతలో కొంత అర్థమయింది.

సత్యవతి అప్పుడు బయటకు వచ్చింది.

కుంపటి త్వరగా రాజుకోలేదు. గామోసు, జుట్టు ముఖంమీదికి ప్రాకి, కళ్ళు ఎర్రపడి అదో రకంగా వుంది అయితే దయాసాగరానికి చాలా అందంగా కన్పించింది ఆమెవేపు ఓసారి నిదానించి చూచాడు. అతనికి హృదయంలో

ఒక అపూర్వానుభూతి మెరిసినట్లయింది.

మేష్టరుగారు యిక తన స్వంతకథ చెప్పుకోవడం మొదలెట్టారు. ఎంతకి తెగకుండా మధ్యమధ్య తన తృషిత జీవితపు లోటుపాట్లను వ్యక్తరుపస్తూ.

దయాసాగరం చాలాజాలిపడ్డాడు.

ఆ పరిచయం అలా వృద్ధిఅయింది.

ఆయన ఎప్పుడూ చెబుతూవుండేవాడు.

రెండో అమ్మాయి విషయం తనకు దిగులులేదని.

దయాసాగరాని కనిపించేది. తాను సత్యవతిని పెళ్ళి చేసుకుంటే ఏమని!

తన చెల్లెలు పెళ్ళికావాలి.

అన్నయ్యకీ, అమ్మకీ - చెల్లెలు పెండ్లి కి, తనపెళ్ళికీ మధ్య ఒక గొలుసు ముడిపెట్టుదామనే ధ్యాస వున్నదని అత డెరుగును.

కానీ కథ అంతదూరం నడవనేలేదు.

దయాసాగరం అలానే కొన్నాళ్ళువేరేధ్యాస లేకుండా రూములోనే గడిపాడు.

అప్పుడప్పుడూ, మేస్టారింటికి పనిలేకపోయినా వెళ్ళ తూండేవాడు.

ఇతడేమైనా అంటే సత్యవతి నవ్వటం నేర్చుకుంది. రెండోఅమ్మాయి ఎప్పుడూ దగ్గరకు వచ్చికూర్చుంటుండేది. మేడమీద రూము ముందు పిట్టగోడ నానుకుని సత్యవతి స్కూలుకు పోతూంటే-స్కూలునుంచి వస్తూంటే తదే కంగా చూచేవాడు.

యవ్వనం అలాంటిది.

రెండో అమ్మాయిని ఎప్పుడూ సత్యవతిని గురించి అడిగేవాడు.

అతడిలో వేరే వూహాలేం లేవు. సత్యవతిసౌందర్యమూ కాదు, విశుద్ధప్రేమాకాదూ, అతణ్ణి ప్రలోభపెట్టింది. కేవలం యవ్వనం మాత్రమే.

ఆ విషయం అతడెన్నడూ గుర్తించలేదు.

ఆ పలుకులో, ఆ నడకలో, ఆ చూపులో, అతడు కొత్తదనం చూడగలుగుతున్నాడు. ఈ పిచ్చివ్యామోహం వలన.

కానీ అతడది వ్యామోహ మనుకోవటంలేదు.

ప్రేమ అని అనుకుంటున్నాడు.

ప్రేమ ఎందుకు ?

సౌందర్యం కొరకు కాదు, యవ్వనం కొరకు యవ్వనమే సౌందర్యం కావచ్చు!

రూములోని స్నేహితులు దయాసాగరం దశావస్థలను గుర్తించడానికి ఎక్కువరోజులు పట్టలేదు.

ఓరోజున వాళ్ళు వాదంలోకి దింపారు.

"నేను ప్రేమిస్తున్నాను" అని చెప్పాడుదయాసాగరం పెద్దబుద్ధిమంతుడు లాగా.

ఆ స్నేహితులు అతడిని పరిహసించారు.

దయాసాగరం వాళ్ళ అజ్ఞానాన్నీ, హృదయ వైశాల్యం లేమినిచూచి, ఈసడించుకున్నాడు.

ఆ స్నేహితుల్లో ఒక కథారచయిత ఉన్నాడు

అతడు ప్రౌఢ స్తమానం జీవితాన్ని గురించి ఆలోచిస్తూం టాడు. అతడి వ్యూహాలు మాత్రం ఎత్తయినవి. ప్రజలలో వుండే కామ స్వతంత్రత, స్వార్థబుద్ధి, అసూయ, చూచి అతడు నొచ్చుకుంటాడు. అయితే అతడిలో మాత్రం అవి లేవా-వున్నాయి. ఇతరులకీ, అతడికీ తేడా ఇతరులకు లేని ఆత్మపరిశీలన అతనికి వుంది. అతను బురదను బురదని తెలిసే ఒంటికి పట్టించుకుంటాడు. తాను చేసే ప్రతి చిన్న తప్పుపనికీ యితరులవలే కాకుండా బాధ పడతాడు అయితే ఆ తప్పులు చేస్తూనే వుంటాడు. అంటే అతడు వట్టి బలహీను డన్నమాట. బలహీనతలను అదిగమించలేని స్వచ్ఛమయిన మానవుడు!

కొద్దిరోజుల క్రింద అతడూ, దయాసాగరం ఆ ఇంటికి కొద్దిదూరంలోనే వున్న ఓ మేడ ఇంట్లోని ధనవంతురాల్ని గురించి వాదించుకున్నారు. ఆమెకు ఏభై యేళ్ళదాక వుండ వచ్చు. మొగుడు సంతానాన్ని ఇవ్వకుండా కావలసినంత డబ్బుమాత్రం ఇచ్చి చనిపోయాడు. ఆమె పదహారేళ్ళ బాలలాగా అలంకరించుకుని మేడమీద తిరుగుతుంటే వాళ్లు చాలామార్లు చూశారు. ఆమె ఇరవై యేళ్ళలోపు వాణ్ణి వుంచుకుందట. అది ఆ పేటలో వున్నవాళ్ళందరికీ తెలుసు. పైపెచ్చు ఆమె ఓ కొడుకును దత్తు తెచ్చుకుని ఆ కొడుక్కి ఇంకో ధనవంతుల ఇంటి పిల్లనే తెచ్చి చేసింది. అయినా ఆమె ప్రవర్తనలో ఏట్టిమార్పూ రాలేదు.

అయితే కోడలి ప్రవర్తనలో విశేషమైన మార్పు కనిపించింది. ఆమె దత్తు తెచ్చుకున్నవాడు నిర్భాగ్యుడు.

ఆమె కోడలు గొప్ప భాగ్యవంతుల ఇంటిపిల్ల. పైన అత్త గారి నీచవర్తన ఆపిల్ల అసహ్యించుకుందో, అసహ్యించుకో లేదోకాని, భర్తనుమాత్రం ఆమె నిరాదరించింది. దానికి కారణం ఆమెకు ఆ ఇంట్లోని ఆ ఇద్దరు వ్యక్తులమీద ఏమాత్రమూ లక్ష్యం లేక పోవటమే--ఆ కుర్రవాడు యీ కథా రచయితకు స్నేహితుడు, దయాసాగరం అంటాడు---"అవి సహజమైన బలహీనతలు. మనుషులనే వాళ్ళందరికీ వుండేవే. ఏంచేస్తాము. నేను హృదయపూర్వకంగా క్షమించ గలను"

కథారచయిత బాధగా అరిచాడు "నేను క్షమించలేను.

దయాసాగరం అన్నాడు. నీకు విశాల హృదయం లేదు" అని.

కథా రచయిత చాలా బాధపడ్డాడు. కాని మరేం మాట్లాడలేదు. దయాసాగరం మేష్టారింటికి రెండు మూడు సార్లు భోజనానికికూడా వెళ్ళాడు.

పరిచయంకూడా వృద్ధిఅయింది.

మేష్టారి మేనల్లుడు బాగా స్నేహమైనాడు.

సత్యవతికూడా మాట్లాడుతోంది.

చివరకు మేష్టరు ఒకరోజున దయాసాగరం తల్లిని పోయి కలుసుకుని మాట్లాడాడు. ఆమె మాఅమ్మాయిపెళ్ళి కాందే వాడిపెళ్ళికాదు అని చెప్పింది. "పోనీ మీఅమ్మాయి పెళ్ళయినతర్వాతనే చేసుకోండి మాఅమ్మాయిని మీ అబ్బాయికి" అన్నారు మేష్టారు.

కాని దానికామె సమాధానం చెప్పలేదు.

దయాసాగరానికి సమాధానం చెప్పటం చేతకాదు.

ఇది ఇలా వుండగా దయాసాగరం ఓ రోజున దయనీయమైన పరిస్థితుల్లోకి నెట్టబడ్డాడు. ఆఊళ్లోనే ఓ స్నేహితుడు మేష్టారింటికి వెళ్ళుతున్నందుకు పరిహసించి, 'ఇక నేం మేష్టారు నిన్ను వదలి పెట్టడు. ఆకూతురు ఇంట్లోవున్నంత మటుకు ఏదో అనబోయాడు. దయాసాగరానికి వాడిముఖం రక్కాదామనిపించింది. "నీకు సంస్కారం ఏకోశాన లేదు." అని ముఖం మీదనే అనేశాడు.

"బ్రహ్మసమాజంలో చేరిపోయావేంటి. సంస్కారం సంస్కారం అని పడిచస్తున్నావ్" అన్నాడు స్నేహితుడు అని చాలా చెడ్డగా మాట్లాడాడు.

తర్వాత కొంతమంది మరికొంతమందితన వెనక నవ్వటం విన్నాడు. దయాసాగరం.

మేష్టారుగారి స్వర్గీయ గృహిణిగురించి దయాసాగరానికి కొంత తెలిసింది. అంతే దయాసాగరం మేష్టారింటికి మళ్ళీపోలేదు కనీసం స్నేహితుల రూముకయినా పోలేదు,

మేష్టారు బజారులో కనబడితే సిగ్గుతో తలవంచుకున్నాడు. ఆయనగారి చిన్నమ్మాయి రెండు మూడుశార్లు బజారులో కనబడితే చనువుగా దగ్గరకు రాబోయింది. దయాసాగరానికి అభిమానం లేకపోగా దురభిమానం తల మెత్తేది. ఎలా వదిలించుకుందామా అనే దిజ్ఞాసకలిగేది.

ఒకసారి దయాసాగరం సత్యవతికి ఎదురు పడ్డాడు. అప్పుడతనికి చాలా సిగ్గయింది. అయితే అప్పటికీ ఆమెవేపు కన్నార్పకుండా చూడకుండా వుండలేకపోయాడు. తేరపార చూచాడు. సతంవతి కండ్లలో ఆసహ్యత, ఆ క్రోధంఅతను

గ్రహించలేక పోలేదు. అయినా అతడు ఆమెను చూచినతరువాత హృదయంలోని తృష్ణ కెరటం నుండి తప్పించుకోలేక పోయాడు. ఆమె సౌందర్యం మునుపటికంటే ద్విగుణీకృతమయినట్లు అనిపించింది. అతని వెధవమనస్సు ఆమె నెలాగైనా పొందుతే బాగుండునని కూడా హెచ్చరించింది.

ఆ రాత్రి అతనికి సత్యవతి కలలో కన్పించింది.

మళ్ళీ కొన్నాళ్ళపాటు అతని మనస్సు సత్యవతిని గురించిన చింతతోనే సతమత మయింది.

అతడి మనస్సు ద్వంద్వమై, ఒకభాగం ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకోమని చెబుతూంది.

ఇంకోభాగం ఆ అమ్మాయి సౌందర్యాన్ని ఎలాగైనా తాకి చూడమని రెచ్చగొడుతూంది.

అతడిలోని పశుత్వం ప్రకోపించినప్పుడు రెండోసలహా అతనికి బాగాఆనుతుంది. ఆశయ సాఫల్యతకై ఎన్నెన్నో వ్యూహాలు చేస్తాడతను.

అతడిలోని మానవత్వం మేల్కొన్నప్పుడు మొదటి సలహా మనసుకి పడుతుంది. అప్పుడతడిలో గౌరవం, సంప్రదాయం, నీతి, ఇత్యాది ఆలోచనలన్నీ మెదలై ఆ కోరిక కాస్తా హరించుకు పోతుంది.

తాను యిన్ని పుస్తకాలు చదివాడు. పుస్తకాలు చదవమంటే చాలామంది వ్యక్తుల జీవిత చరిత్రలను పరిశీలించటమేకదా ! మరి తానెందుకిలాంటి సంఘర్షణలోపడి కొట్టుకుంటున్నాడు? అంతరాంతాల్లో తనలో స్వార్థం తిష్ట వేసుకునుంది అన్నమాట. అయినా అది తప్పుకాదను కుం

టాడు. తాను మానవుడేననీ, తనను తానే వెన్నుచరుచు కుంటాడు. ఒక్కొక్కప్పుడు తాను చాలా గొప్పవాడననీ, విశాల హృదయుడననికూడా అనుకుంటాడు.

కానీ ఒకనాడతనికి తెలిసింది సత్యవతి పెండ్లి అని.

మేష్టారు శుభలేఖ పంపించారు.

బజార్లో కనుపించినప్పుడు స్వయంగా తప్పకరావల సిందని కూడా చెప్పాడు.

దయాసాగరం మనసు విచలిత మయింది.

పెండ్లికొడుకు ఎవరోకాదు. తనస్నేహితుడు, కథా రచయితే అతని హృదయంలో యిదమిద్దమని చెప్పలేని సంచలనం కలిగింది.

ఎవరు విశాలహృదయుడు? ఎవరు కాదు.

ఊరుదాటి పోయి తుమ్మచెట్లలో పోయి కూర్చుని అస్తమితరుణరవిబింబపు సారథ్య శోభనుచూస్తూ ఆలో చించాడు.

అప్పటికీ అతని హృదయం అనతలివాడి ఔన్నత్యం గుర్తించటానికి ఒప్పుకోడంలేదు.

అతడికి విషయాలన్నీ తెలిసుండవ్ అని నీచంగా ఆలోచించాడు. కానీమళ్ళీ ఇంతలో అతడికది నిజంకాదని బలంగా గుర్తొచ్చింది అతడి కండ్లవెంట నీరుకారినై.

పెండ్లికతడు పోలేదు. మనసులోనే వాళ్ళిద్దరినీ ప్రక్క ప్రక్కన నిలబెట్టి వాళ్ళజీవితాలు సుఖవంతం కావాలని కోరుకున్నాడు. అతడిలోని మానవత్వం మేల్కొని తక్కిన బలహీనతలకంటే ప్రవర్ధమవుతుంది వాటివలన.

# 3

పందిరిమీద సన్నజాజి పూలు విరగబూచి, చల్లటి గాలికి ఒక్కసారిగా వాసనలు తేలివచ్చినట్లు, వెన్నెలరాత్రి నైట్‌క్వీన్ పూలపరిమళం కమ్ముకున్నట్లు, సన్నాయి వాయిద్యం అలలు అలలుగా తేలివస్తోంది.

ప్రొద్దుటనుంచీ ఒకటే హడావుడి. స్టేషను మాష్టారింట్లో పెండ్లి. బంధువులు చాలమంది వచ్చారు. ఎక్కడ చూసినా ఆనంద కోలాహలమే. ప్రొద్దున్నే లగ్నం అయిపోయింది. తక్కిన కార్య కలాపమంతా యదావిధిగా సాగిపోతున్నది. పెద్ద యెత్తున భోజనాలుఅ వీయేర్పాటైనందువల్ల, పెండ్లివారు భోజనాలుచేసి లేచేసరికి మధ్యాహ్నం మూడు గంటలైంది. సాయంకాలం మేజువాణీ, తర్వాతవూరేగింపు.

భోజనాలు అయీ అవకమునుపే ఆడవాళ్ళు అలంకరణలలో దిగారు. ఈ చీరమార్చి అచీర, ఆచీరమార్చి ఇంకో చీర. పసిపిల్లల దగ్గరనుంచి పడుచువాళ్ళూ, ఇంకా పెద్ద ముత్తైదులదాకా అలంకరణలోనే మునిగి తేలిపొయ్యారు. తెలుగువారి పెండ్లిండ్లలో మేజువాణీదీ, అంతకంటె వూరేగింపుదీ ఒకప్రత్యేకత. ఎనలేని ఉత్సాహంతో పిల్లా---పాపా మొదలుకొని పెద్దవాళ్ళదాకా పాల్గొంటారు.

చెండ్లాడించటం పెళ్ళిళ్ళలో ముఖ్యమైన సరదా-- వారి సంస్కృతిలో యివన్నీ ముఖ్యమైన భాగాలుగా కలసిపోయినయ్. వారిప్రత్యేకత అందులోనే కనిపిస్తుంది. తరతరాలుగా వారి జీవిత విధానాన్ని, యీ సంస్కారాలు చుట్టుముట్టుకొని వస్తున్నాయి.

చెండ్లాడించటమూ, పేర్లు చెప్పించటమూ, వదినలూ, మరదులూ, వరసలాడుకోవటమూ, వాదులాడుకోవటమూ, యథావిధిగా జరిగిపోయినయ్.

తరువాత వూరేగింపు బయలుదేర దీశారు. ఎంత ఉత్సాహంగా బయలుదేరినా, వూరు చిన్నది కావటం మూలాన, వూరేగింపు బృందం కాళ్ళరిగేలా తిరగాల్సిన పని లేకపోయింది. అక్కడక్కడ చాలాసేపు ఆపుతూ వచ్చినప్పటికీ, ఒకటి రెండు గంటల్లోనే వూరేగింపు బృందం ఇల్లు చేరుకుంది.

వెన్నెల బాగా కురుస్తున్నది.

పెద్దలంతా ఎక్కడి వాళ్ళక్కడ నడుంవాలి పడుకున్నారు. భోజన ప్రయత్నాలు సాగుతున్నాయి.

పెండ్లికూతురూ, పెండ్లికొడుకూ గూడ నీరసంగా గోడలకు చేరబడిపోయారు. వాళ్ళవాళ్ళ స్నేహితులు స్నేహితురాండ్రుకులాసాగా కబుర్లు చెపుతుంటే అలవోకగా నవ్వుకుంటున్నారు.

కమల వచ్చి చూసిపోయింది.

అల్లుడితో, స్నేహితులు ఏమిటేమిటో పేలుతున్నారు. అతడు వాళ్ళతో చేరి నవ్వుతున్నాడు.

వెంటనే కూతురు దగ్గరకు వచ్చి చూసింది. స్నేహితురాళ్ళతో. సమవయస్కులైన చుట్టాల పిల్లలతోనూ, వినోదంగామాట్లాడుతున్నది చిట్టి. తలుపువద్ద జారగిలబడి కాసేపు అలానే చూసింది.

. . . ప్రొద్దుటనుంచీ కమలకు క్షణంకూడా తీరికలేదు.

ఇంట్లో పనంతా తానే చూసుకోవాల్సి వచ్చింది. వచ్చేచుట్టాలను ఆదరించి, వసతులు చూపించటమూ, వంట వాళ్ళకు ఏవి ఎక్కడున్నాయో చూపించి సహాయపడటమూ, వచ్చినవాళ్ళందరికీ టిఫిన్లూ, కాఫీలు సరఫరా అయేట్లు చూడటమూ. మధ్యమధ్య పురోహితుడు తెమ్మనే వస్తువులను తెచ్చి ఇవ్వటమూ, ఏపనికి పురమాయించాల్సిన వాళ్ళను ఆ పనికి పురమాయించటమూ, మొదలైన పనులతో ప్రొద్దుటనుంచీ ఆమెకు ఒకచోట నిలవటానికి కాని, ఒకచోట కూచోటానికి కాని క్షణంకూడా తీరిక లేకపోయింది. పూర్తిగా అలసిపోయింది. ఒక్కచోట కూడ ఒక్కక్షణం నిదానించి నిలబడలేదు.

లగ్నం వేళప్పుడు మాత్రం అందరినీ వత్తిగించుకుని వచ్చిచూసింది. ఆమెకు ఆ సమయం తన హృదయం పాల సముద్రములాగునా, అందులోని అమృతమే యీరూపంగా చిట్టిగా అవతరించిందనీ అనిపించింది. చిట్టిమీద ప్రేమ కట్టలు తెంచుకొని ప్రవహించింది. ఈ అమృతాన్ని ఆ కుర్రాడు జీవితాంతం భద్రంగా పదిలపరచుకునేట్లు చూడమని భగవంతుణ్ణి శతధా ప్రార్థించింది. ఆ కుర్రవాడిమీద కూడా ఆమెకు అలాటి విశ్వాసం కలిగింది. చిట్టిమొహం నిండు పున్నమనాటి చందమామలా వెలిగిపోతున్నది. ఆమె కళ్ళలో మాధుర్యం అంతా తొణికిసలాడుతున్నది. అలవోకగా అతడి కేసి చూస్తున్నది.

కమల అత్యుత్సుకతతో చూసింది.

అతడు ఆమె గళ సీమను పవిత్రమయిన మూడు

ముళ్ళు వేశాడు. జీవితాంతం విడదీయరాని బంధం.

తరువాత ఎంతో సందడిగా తలంబ్రాలు జరిగిపోయింది. కమల కళ్ళలో నిండుగా నీళ్ళు గిర్రున తిరిగినయ్. ఆమె ఆలోచనలు ఆకాశాన్ని చీల్చుకుని ఎక్కడెక్కడికో పోయినవి. అక్కడ చేరిన వారందరినీ చుట్టూరా కలయచూసింది ఆమె. అందరి ముఖాలూ ఆనందంతో తాండవమాడుతున్నవి. ఇంత సంతోషకరమయిన సమయంలో కూడా ఏమిటో వెలితి అనిపించింది ఆమె హృదయానికి. అయినా ఆమెలో రేగుతున్న తీపి చేదువంటి అనుభూతిని ఆమె చిక్కబట్టుకో కలిగింది. కొంగుతో కళ్ళుతుడుచుకుంది.

అందరూ గొల్లున నవ్వారు.

కమల కూడా నవ్వింది, చిన్నగా కూతురి చిలిపి తనానికి.

కన్నె ముత్తయిదువులెవరెవరో పాటలు పాడారు. ఆ పాటలలోని భావం ఆమె హృదయానికి చేరుకోలేదు. ఒక్కరు మాట్లాడే మాటకూడా ఆమెకు వినిపించటం లేదు. ఆ కోలాహలంలో ఆమె మనస్సు నిశ్చలంగా, నిర్మలంగా కూతురి, ఆమె భర్తచుట్టూ పరిభ్రమిస్తున్నది. హారతులు పెట్టారు. నవ్వుకున్నారు.

కట్నాలు చదివించారు. ఎన్నెన్నో వెండి సామానులు వచ్చినయ్ అతడికెన్నో పుస్తకాలు వచ్చినయ్.

వాళ్ళ పేర్లు ఘనంగా చెప్పి, వధూవరులకు వాళ్ళిచ్చిన బహుమతులను పురోహితుడు అందించాడు.

వాళ్ళకళ్ళు మిలమిలా మెరిసిపోయినయ్.

ఇంతలో ఆమె నెవరో పాట పాడమన్నారు.

ఆమె తప్పించుకుని ఇంట్లోకి పోదామని చూసింది. అయినా, తక్కిన వాళ్ళంతా ఆమెని వదిలిపెట్టలేదు. ఆమె చాలా చక్కగా పాడుతుందని ఇంట్లోవాళ్ళందరికీ తెలుసు. చుట్టాలందరిలోనూ తెలుసు. ఆమె పాటఅంటే వాళ్ళంద రికీ చాలా యిష్టం. ఆమె పాటవిని ఎన్నిఏండ్లూ, పూండ్లూ గచిచినవో.

ఆమె గొంతులో ఒకప్పుడు కిన్నెరలు పలికేవి.

కొండకొమ్ములనుండి దూకే సెలయేరులా, ఎఱ్ఱ గన్నేరు మొగ్గలను కొరికి చెంగు చెంగున దూకే బాల సారంగి పరుగులా ఆమె కంఠంలో ఆవృత్తులు కదను త్రొక్కేవి. ఆమె పెండ్లి కాకముందు ఏ పెండ్లి కామె హాజరైనా, ఎన్నిరోజులైనాసరే ఆమెను వదలకుండా వచ్చిని పాటలన్నీ, పాడించుకునే వాళ్ళు చుట్టాలు.

కాని ఆమెగొంతు ఆమని వెళ్ళిపోగా, కోకిల గొంతు వలే అయిపోయింది తరువాత. కష్టాల కొలిమిలో ఆమె జీవితం కాల్చబడినది.

"నేను పాడలేనర్రా!" అని అమె చిరునవ్వుతో తప్పించుకో బోయింది.

అయినా వాళ్ళు ఆమెను వదిలిపెట్ట లేదు,

ఆమె పాడబోయింది.

ఆమె గొంతు నిండుకొచ్చింది. బొంగురు పోయింది. ఆమె కండ్లనిండా నీళ్ళు క్రమ్ముకొచ్చాయి.

ఆమె కంఠంనుండి ఒక్క చరణంకూడా వెలువడ

లేదు. వెలువడిన చరణం గొంతు నిండుకొచ్చినట్లుగా వెలువడింది. కొంగుతో కళ్ళు వత్తుకుని ఆమె ఇంట్లోకి వెళ్ళి పోయింది.

చిట్టి అమ్మ వుద్వేగంచూచి ఆశ్చర్యపడిపోయింది.

తల్లి హృదయంలో అంత వుద్వేగం ఎందుకో ఆమెకు అర్థంకాలేదు. కనుకొలుకులలోనుండి అతనివేపు చూసింది. అతడి హృదయాన్నికూడా చూడగలిగాయి ఆమె చూపులు. అతడి వదనం నిర్మలంగా వుంది.

ఆమె దొంగచూపులను అతడు పసిగట్ట కలిగాడు. అతడు చిరునవ్వులు చిందించాడు. చిట్టి సిగ్గుపడిపోయింది.

కమల మళ్ళీ భోజనాల దగ్గరికోసారి వచ్చి చూసి పోయింది.

సాయంకాలం మేజువాణీ వద్ద ఒకసారిచూసిపోయింది.

మళ్ళీ యిప్పుడు వచ్చింది.

ఆమె మనస్సులో ఒక్కసారిగా లక్షరూపాయలు దొరికిన అనుభూతి కమ్ముకుని వుంది.

కాని ఆమెకున్న ఒకే ఒక్క ఆధారం తనని విడిచి, ఇంకొక ఆధారాన్ని పట్టుకుంది.

అది ఒకరకమైన దిగులయినా, అది మధురమయిన దిగులు.

ప్రతి గృహస్థూ ఆడపిల్ల పెండ్లిచేసినప్పుడు తనబరువును వదిలించుకున్నందుకు కొంత సంతోషపడినా, కొంత దిగులు పడటముకూడా సహజమే.

అలానే కమల హృదిలోకూడా కొంత సంతోషమూ

కొంత దిగులూ-వాటివాటిస్థానాలు మార్చు కుంటున్నాయి.

వంటసాలలోంచి మధురమయిన వాసనలు కమ్ము కుంటున్నాయి. పెండ్లి పందిరినిండా పెట్రోమాక్సులైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి.

పదకొండు గంటలకు భోజనాలకు పిలుపువచ్చింది. అందరూ చేరారు.

పెడ్లికూతురి ముఖాన నిద్రకొట్టవచ్చినట్లు కనబడు తూంది. ఎవరో సరాగమాడారు.

పెండ్లికూతురు ముఖం దిరిసెన పువ్వులా ఎర్రబడి పోయింది. పెండ్లికొడుకుకూడా నవ్వుకున్నాడు.

అంతా పంక్తిలో కూర్చున్నారు.

కమల ఒకసారి చూచిపోదామని వచ్చింది.

పెండ్లివారు సరదాగా వరసలాడుకుంటూ మాటకు మాట వడ్డించుకుంటూ, భోజనాలు చేస్తున్నారు.

అన్నయ్య ఎక్కడా కనుపించటం లేదు కమలకు.

ఎవరినో అడిగింది.

"ఆకలి కావడంలేదని పోయి పడుకున్నాడు" అని చెప్పారు వాళ్ళు.

కమలకు దిగులైంది.

తక్షణమే అక్కడనుండి వెళ్ళిపోయింది.




ఆ నవ్వులూ, ఆ సరసాలూ ఆ పాటలూ, ఆ మాటలూ, ఆమె పట్టించుకోలేదు.

గదులు గదులు తిరిగి పరిశీలనగా చూసింది.

పెండ్లి సంభారాలు అన్నీ స్టోరు చేసిన గదిలో

అన్నయ్య నిశ్చింతగా పడుకుని వున్నాడు. చాపపరుచుని.

కిటికీలోంచి వెన్నెల పడుతున్నది చాపమీద.

పక్క కూడా సరిగా లేదు. వ్యత్యస్తంగా పడుకుని వున్నాడు.

దగ్గరగా వెళ్ళి చూసింది కమల.

ఎంత నిశ్చింతగా నిద్రపోతున్నాడో అనుకున్నది.

"అన్నయ్యా" అని పిల్చింది.

తనగొంతు తనకే ఆశ్చర్యం గొల్పింది.

గొంతు నిండుకొచ్చింది.

మళ్ళీ పిలిచింది.

అప్పుడాయన కదిలి లేచి కూర్చున్నాడు.

"ఏమిటి తల్లీ!" అన్నాడు.

"ఇక్కడ పడుకున్నావేం? అవతలవాళ్ళు భోజనాలు చేస్తున్నారు. నువ్వురా" అంది కమల.

"లేదు. నాకు ఆకలి లేదు" అన్నాడు సత్యనారాయణ. అతడి కంఠంలో విహ్వలత ప్రస్ఫుటంగా కనబడుతోంది. తెల్లవారుజామున పెండ్లివారు వెళ్ళిపోవాలి. చిట్టి వెళ్ళిపోతున్నది. కన్నీటి చారికల తడిముఖం - పైని దీపపు వెలుతురు యింకాస్త ఎక్కువ చేసి వున్నట్లయితే, ఆమె చూడకలిగేది.

"ఆకలెందుకులేదు? కొద్దిగాతిను. ఇక్కడకే తీసుకుని వచ్చేనా?" అన్నది.

"వద్దు వద్దు" అన్నాడతను.

"లేదు కాస్తఫలహారం పట్టుకొస్తాను. . . మరి తేనా-

కాఫీకాస్తాను. లేకపోతే నిమ్మరసం పంచదార వేసి తెస్తాను" అన్నది కమల.

"ఏవీ వద్దమ్మా" అన్నాడతను.

"కాదు" అని లేచిపోయింది కమల.

ఒక పళ్లెంలో ఇన్ని తినుబండారాలు తీసుకుని వచ్చింది. వాటిని చూడగానే ఆతడికి విముఖత్వం పుట్టింది. అయినా తీసుకుని పక్కనే పెట్టుకున్నాడు.

కమల ముఖంలో ఆ ప్రసన్నతను చూసి అతడు వాటిలో కొద్ది కొద్దిగా తీసుకుని నోట్లోవేసుకున్నాడు. తరువాత నిమ్మరసం తీసుకున్నాడు.

పందిట్లో పెళ్ళివారి భోజనాలైన హడావిడి చెల రేగింది. కమల అక్కడనుంచి వెళ్ళిపోయింది.

వెంటనే అప్పగింతలకు కూచున్నారు. సత్యనారాయణ కూడా లేచి రావాల్సి వచ్చింది.

అప్పటికే ఎవరో కొద్దిమంది తప్ప అంతా నిద్రలకు పడ్డారు. వానకురిసి వెలిసినట్లయింది. కమలమాత్రం అక్కడే నిల్చుని వేడుకలు చూస్తున్నది.

ఇంక కొద్దిగంటల్లో చిట్టి వెళ్ళిపోతున్నదీ. తలచు కుంటుంటే కమలకు దిగులౌతున్నది. అయినా అది ఎక్కువ ఆనందము వలన కలుగుతున్న దిగులే అనటంలో సందేహం లేదు. తెల్లవారుజామున పెళ్ళివారు వెళ్ళిపోయారు.

* * *

మూడు నెలల తరువాత సంగతి.

ఒకందుకు సత్యనారాయణ గారింట్లో విచార

మేఘాలు కమ్ముకుని వున్నాయి. మరేంలేదు విచారించదగ్గ విషయం. రమణమూర్తికి కలకత్తాలో ఏదో ఉద్యోగం అయింది. రైల్వే డిపార్టుమెంటు తాలూకు.

కమలకు పొద్దుటనుంచి కాళ్ళు భూమిమీద ఆనటం లేదు. సత్యనారాయణ ముఖమంతా పిచ్చిపట్టినవాడిలా అయిపోయింది. నిజానికి లోకులు దీనిలో అంత విచారించ టానికి ఏముంది? అని ప్రశ్నించవచ్చు. దానికి సమాధానం ఇవ్వటం బహు తేలిక. సత్యనారాయణకు, కమలకూ, చిట్టి అంటే ప్రాణసమానం. వాళ్ళిద్దరూ తమ మరుభూమిలాంటి జీవితాన్ని ఆ అమ్మాయిని చూసుకొనే ఒకింత తృప్తితో భరించారు.

సత్యనారాయణ ఎప్పుడూ ఒకటే ఆలోచిస్తుం టాడు. అందులోని విచిత్రం అతడికిఅవగాహనకావటంలేదు. తమ ఇద్దరి జీవితాలు మోడువారి పోవటంలోని అర్థం అతడి మనసుకేమీ అందదు.

ఆ తల్లి కడుపుపంట అని, ఆ తల్లి కడుపుచలువ అనీ అంటుంటారే - మరి తమతల్లి కడుపున పుట్టిన తామిద్దరూ ఇలాటి తృషిత జీవితం గడపవలసిన అవసరం కలుగుతుందని ఎవరనుకున్నారు.

అమ్మకడుపున పుట్టిన తమఇద్దరిలో ఒకరు కాకపోతే ఒకరైనా పచ్చగా వుండకూడదా ? ఈ విధివిలాసంలోని అంతరార్థం మనసుకీ దురవగాహనగా వుంటుంది. ఏలో కంలోనన్న, యీ శోకాలన్నిటికి కారణభూతుడున్నాడా ? అతడికి వేరేపనిలేదా? జీవితంలోని యీ వైవిధ్యాలెందుకు?

కొందరి జీవితాల్లో మందారాలు పూయించి కొందరి జీవితాల్లోమండే నిప్పులుపోయటమే ఆయన ఆనందమా ?

అయితే వీటన్నిటికీ మూలమేమిటి ?

జన్మాంతరమనీ, కర్మఫలమనీ ఎన్నెన్నో చెపుతారు కదా ! నేడు వాటిని మానవుడు శాస్త్ర విజ్ఞానపు మత్తుతో తుస్కారించి వేస్తున్నాడే, మరి ఇలాటి జీవితాలు పరిశీలించి చూస్తే హేతువాదము ఎందుకూ కొరగాకుండా దుమ్మకూ ధూళికీ కొట్టుకొని పోదా ?

నాన్నగారు తక్కిన లోకంతోపాటే తమకేమి తక్కువచేసిపోలేదు. కావలసినంత సంపాదించి ఇచ్చిపోయారు. అమ్మ ఎటువంటిది? ఆమెను తలుచుకుంటేనే సర్వ పాపాలకు ఉతికలుగుతుందే. ఆమె తలంపుతో కన్నుల్లో నీళ్ళు తిరుగుతవే. ఆమె బ్రతుకులోని పవిత్ర్యం పులకరింతలు కలిగిస్తుందే. మరి ఆమె కడుపున జన్మించిన తామిద్దరూ అడవిలోని ఆకులులేని చెట్లవలె ఎందుకు అయినారు?

ఈ విషయం ఎంత అలోచించినా సత్యనారాయణ ఒక నిశ్చయానికి రాలేకపోయేవాడు.

చిట్టితల్లి అతడి జీవితంలోని వెలితిని చాలామటుకు కొట్టిపారవేసింది. అతడిలో మళ్లీ జీవితంలో ఏదోపొందాలనే లాలసత, వర్షోత్తువు వచ్చినప్పుడు భూమిని బ్రద్దలు కొట్టుకొని పైకివచ్చే మొక్కలా వుద్బోధమైంది. అవాళనుంచి అతడి హృదయంలో ఆర్ద్రిత మళ్ళీ తలమెత్తింది. తాము ఆ రోజున కళ్ళనీళ్ళు పెట్టుకోవటమే కాకుండా, బావురుమని యేడ్చెపసిపిల్లవాడులా అవకపోతే చెల్లెలు తనవెంటవచ్చేదా-

తన కేమీ తీసిపోదు కమల.

అయినా ఆమెను తన ఇంటికి తీసుకొచ్చుకో గలి గేడు.

రమణమూర్తి అంత చదువుకొని వున్నాడని తెలిసివుండి కూడా సత్యనారాయణ ఉద్యోగానికి పోవద్దనిసలహా ఇచ్చాడు. ఆ సలహావిని రమణమూర్తి ఆశ్చర్యపోయాడు.

అయితే సత్యనారాయణ కూడా ఒకందుకు ఆశ్చర్య పడలేదు.

రమణమూర్తి పెళ్ళి అయినందువల్ల పూర్తిగా మారి పోయినాడు అనిపించింది. రమణమూర్తికి అసలేమీ ఉద్యోగం చేయవలసిన అవసర మేమీలేదు. ఇదివరలో ఇటు వంటివీ, ఇంతకంటె మంచివీ అయిన ఉద్యోగాలను అతడు కాలదన్నాడన్న విషయాన్ని రమణమూర్తి నోటివెంటనే విని అతడు విశ్వసించాడు.

అటువంటిది రమణమూర్తి యీ ఉద్యోగానికి సమా యత్త మవటంలోని విశేషం ఆయన తెలిసికోలేకపోయాడు. "నువు ఎందుకు అంతదూరం వెళ్ళటానికి ఇష్టపడుతున్నావు?" అని తాను అడిగినప్పుడు అతడునవ్వి "నేనూ కొంతబరువు బాధ్యతను తెలుసుకో దల్చుకున్నాను అని చెప్పినప్పుడు తానేమీ బదులు పలుకలేక పోయాడు.

అందులో ఖండించదగిన విషయమేమీకన్పించలేదు. అందుకని అతడేమీ మాట్లాడ లేకపోయాడు.

కాని ఆతనికి ఒక అనుమానం లేకపోలేదు. కమలతో చూచాయగా ఆ మాట అన్నప్పుడు ఆమెనుండి తన వూహాలో

నిజంలేకపోలేదని తెలుసుకున్నప్పుడు అతడి విస్మయాధిక్య తకు అంతంటూ లేకపోయింది.

రమణమూర్తి ఉద్యోగానికిపోవటం అనేవిషయంలో చిట్టి అతడితో వెళ్ళమని కోరుతున్నది అని సత్యనారాయణకు తెలిసినప్పుడు సత్యనారాయణకు చిట్టియొక్క మనఃప్రవృత్తి అర్థం కాలేదు. చిన్నతనమని అనుకున్నాడు. కొత్త ప్రదేశాలు చూడాలనీ, కొత్తహోదాలు పొందాలనీ, పిచ్చిపిల్ల వూహిస్తున్నదని సరిపెట్టుకున్నాడు. చిట్టిని ఆ విషయమై అతడేమీ కదపలేదు. రమణమూర్తి ప్రయాణం సర్వమూ సిద్ధమైంది. రమణమూర్తి అక్కా-బావా యీ విషయంలో ఎక్కువ పట్టించుకోలేదు. రమణమూర్తి అక్క మాలతికి తమ్ముడిపెళ్ళితో ఒక పెద్ద సమస్య తీరిపోయినట్లనిపించింది. ఇక ఇమెకు నిశ్చింత. అతడి బాగోగులన్నీ ఆపిల్ల తరఫు వాళ్ళే చూసుకోగలరని ఆమె విశ్వాసం.

ఆ మధ్యాహ్నం వాళ్ళిద్దరూ భోజనాలకు వచ్చారు. తమ్ముణ్ణి చూడగానే మాలతికి నవ్వొచ్చింది. ఆమె యిది వరలో ఎప్పుడూ వీడు యోగిగా మారి పోతాడేమోనని భయపడుతుండేది. అందువలన ఆ తలపు మనసులో మెదిలే సరికి ఆమెకు నవ్వొచ్చింది.

రకరకాల పిండి వంటలు చేశారు. వాటితోపాటే ఒక ఆరునెలలకు సరిపడే స్వీట్సు అన్నీ చిట్టి సంసారానికి తయారు చేసింది కమల. భోజనాలు అయేసరికి కాస్త ప్రొద్దు పోయింది.

తరువాత అందరూ నడిమిహాల్లోకూచున్నారు. కమల

కాస్త చాటుగా కూచుంది.

సత్యనారాయణ, రమణమూర్తిబావా మంచాల మీద కూచున్నారు. మాలతి తమ్ముడితో ఏదేదో మాట్లాడు తున్నది. నిజానికి మాలతికి యీ సమయంలో ఎటువంటి విచారమూ లేదు. చాలా సంతోషంగావుంది. ఆమె యిది వరలో వాదించిందికూడా ఇదే.

కమలకు దిగులుగావుంది. కమల చదువుకున్నదే. ఆమెకు లోకంలోని అన్ని విషయాలూ తెలియక పోలేదు. కేవలం మాతృహృదయం మాత్రమే ఆమెనువిచారపడేట్లు చేస్తున్నది. చిట్టి లోపలసంతోషంగా నేవున్నా ఆమె ముఖారి కొట్టవచ్చినట్లు విచారం కనపడుతున్నది తాను వీళ్ళందరినీ వదలి వెళ్ళిపోవాలన్న తలంపు తప్ప ఆమె కెలాంటి విచారమూ లేదు. అయితే అది తక్కువ విచారముకాదు. పదే పదే తల్లివద్దకు పోయికూచున్నది.

వాళ్ళు ఏదో మాట్లాడా లనుకుంటారు.

కాని ఏమీ మాట్లాడుకోలేదు.

నీరవని స్తబ్ధ వాతావరణం అక్కడ నాట్యం చేయ సాగింది. కాసేపు కూచుని రమణమూర్తి బావ లేచి వెళ్ళి పోయాడు. కమల ఎక్కడ తిరిగినా ఏపని చేసినా కళ్ళలో నీళ్ళు తిరుగుతూవుండేవి చిట్టి తనకు దూరంగా వెళ్ళిపోతు న్నది. ఆమె హృదయమంతా దిగులుతో నిండిపోయింది.

మధ్యాహ్నం మూడుగంటలప్పుడు మాలతి వెళ్ళి పోయింది రమణమూర్తిని వోసారి రమ్మని. చిట్టి ఏవేవో అన్నీ సర్దుకుంటున్నది. సర్దుకోనటంలో ఆమెకు ప్రొద్దుటనుండి

తీరికే లేకపోయింది. "అమ్మా ఇది తీసుకపోయేదా" అని వస్తుంది. క్షణక్షణమూ కమలకు హృదయోద్వేగం హెచ్చటానికి కారణమైంది ఇదికూడ రాత్రిబండికి వెళ్ళిపోదామనుకుంటున్నారు వాళ్ళు.

కాస్త చల్లబడగానే రమణమూర్తి అక్కగారింటికి వెళ్ళాడు. చిట్టికూడా అతడు వెళ్ళిన తరువాత అరగంటకు బయలు దేరింది. చీకటి పడ్డతరువాత ఇద్దరూ వచ్చారు

అప్పటికే వంటపని పూర్తిచేసింది కమల.

వెన్నెల బాగావచ్చింది సత్యనారాయణ ఇంటికి రాలేదు. గదిలో కూచుని రమణమూర్తీ, చిట్టీ ఇద్దరూ మాట్లాడు కుంటున్నారు.

కమల వాకిట బయటకు వచ్చిచూసింది. అన్నయ్య రావటం లేదు బండిలేటు అని ఇందాక సింగువచ్చి చెప్పిపొయ్యాడు.

ఆమె లోపలికి వెళ్ళబోతుంటే పక్కగదిలోనుంచి మాటలు విన్పించాయి. ఆమె ఆగిపోయింది. ఎందుకో వాళ్ళవేపు చూడాలనిపించిందామెకు. చూసింది.

వాళ్ళిద్దరూ బాగా ఒకరికి ఒకరు దగ్గరగావున్నారు. చిట్టి అంటున్నది.

"అమ్మ విచారానికి ఒక హద్దంటూ లేదు ఇవాళ పొద్దుటనుంచీ" అని.

దీనికతడు సమాధానం చెప్పలేదు.

"అమ్మ మనం వెళ్ళిపోయిన తర్వాత ఎలావుంటుందోనని దిగులపడుతున్నది. ఆమె ముఖం చూస్తుంటే నాకు

కడుపులో చేయిపెట్టి దేవినట్లు అవుతుంది."

అతడు ఇప్పుడుకూడా మాట్లాడలేదు.

"అమ్మగారు, మావయ్యకూడా ఎట్లావున్నారో చూశారా" అన్నది.

"ఇందులో ఆశ్చర్య పడాల్సిందికాని, ఇంతగా చెప్పుకోవాల్సిందిగాని వున్నట్లు నాకనిపించదు. ఇది చాలా సహజం అమ్మాయీ" అన్నాడతను.

"కావచ్చుకాని మా అమ్మకు నే నొక్కతెనే—నాకోసమే ఆమె ఇన్నాళ్లూ బ్రతికింది. ఆ సంగతిమీకు తెలియకపోలేదు." అన్నది చిట్టి. "అవునవును" అన్నాడు ఆమెను దగ్గరకు తీసుకుంటూ.

అప్పుడు చిట్టి ముద్దుగా అడిగింది. "అమ్మను నాతో రమ్మంటారు, మనతో తీసుకపోతేమేం."

ఈ మాటలు వింటుంటే కమలకు చాల, సంతోషమైంది.

కాని అతను "నాకు యిష్టంలేదు అరుణా, అక్కడి ఆచార వ్యవహారాలూ, ఆహారవిహారాలు ఆమెకు నచ్చుతవా నచ్చవా అన్న ప్రశ్న అటుంచి, ఆ వాతావరణం ఆమెకు సరిపడను" అన్నాడు.

అతడి మాటల్లో నిజంలేదని, అతడు కావాలని అలా అంటున్నాడని కమల అనుకుంది.

చిట్టి ఏమంటుందో వినాలని ఆమె కుతూహల పడ్డది. అతడలానే అంటాడు అతడు అలాఅనటంలో వింతేమీలేదు.

చిట్టి అన్నది.

"నిజమే నాకూ అలానే అనిపిస్తున్నది."

కమల ఆశ్చర్యానికి మేరలేకుండా పోయింది.

చిట్టి అలా అంటుందని ఆమె ఊహించలేదు. ఇంకా బలంగా అతడికి నచ్చచెబుతుంది అనుకుంది. నిజంగా వాళ్ళు తనని తమతో రమ్మని కోరితే తానుఏమని చెప్పాలో అని కూడా ఆలోచించుకుంది. అలా అడగాలేకాని తాను తప్పకుండా వెళుతుంది. అన్నయ్యను వదలిపెట్టి పోవడమా అని మనస్సు ఆమెను హెచ్చరించినప్పటికీ, ఆమె ఆ విషయం గురించి ఎక్కువ ఆలోచించ లేక పోయింది.

కాని ఇప్పుడు ఆమె ఆశ నిరాశ అయింది. అయితే ఆమెకు యీ ఆశ బలంగావున్నదనికాదుకాని, మినుకుమినుకు మంటూ వుండేది కాని అదికూడాపోయింది. ఆమె చిట్టిని గూర్చి ఆలోచింది. తనని గూర్చి ఆలోచించుకుంది. తన గడచిన జీవితమంతా కళ్ళముందు తిరిగినట్లైంది.

## 4

ఎక్కడ గోదావరి ? ఎక్కడికృష్ణ ? ఎక్కడి గుంటూరు ? ఎక్కడి విశాఖపట్నం ? ఎన్నెన్నివూళ్ళు తిరిగి వచ్చారు. అంతులేని యీ జీవయాత్ర ఇలాసాగిపోతునేవుంది. ఎక్కడో దీనికి ఆఖరి మజిలీ వుంటుంది. కాని అది ఎక్కడ వున్నదీ ఎవరికీ తెలియదు.

నా కథ నేను చెప్పుకుంటూనే వినేవాళ్ళకు బాగా తెలుస్తుంది. వూహించరాని, వూహించలేని కొత్త సంగతులు తెలుస్తవి. ఎవరో చెప్పగలిగినా, చెప్పినా నా హృదయం లోని బాధల గాధలు వాళ్ళకెలా తెలుస్తవి.

## కమల కథ

విశాఖపట్నంలో నాన్న మెడికల్ ఆఫీసరు చేస్తుండే వారు. నేను పుట్టిందీ పెరిగిందికూడా అక్కడే అవటం చేత ఆ పరిసరాలతోనే నాకు ఎక్కువ పరిచయం వుంది. నేను చిన్నప్పుడు పెరిగినవిధంగా చాలా తక్కువ మంది పెరిగి వుంటారు. ఆడిందిఆట, పాడిందిపాట అంటారే- ఆవిధంగా పెరిగాను. దీనికి కారణం లేకపోలేదు.

మా వంశంలో రెండు మూడు తరాలనుంచీ ఆడపిల్లలే పుట్టలేదు. నాన్నగారికి కూడా ముందు మగపిల్లవాళ్ళు ఇద్దరు పుట్టి పొయ్యారు. తరువాత అన్నయ్య పుట్టాడు. తరువాత నేను.

అందుకని నన్ను పువ్వుల్లో పెట్టి పూజించారు. నాన్నకు నేనంటే పంచ ప్రాణాలు. ఇంకా విశేషంగా చెప్పాలంటే నేను క్రింద నడచి ఎరుగను. ఇంటినిండా ఎప్పుడూ బంధువులు వస్తూపోతూ వుండేవారు.

బాల్యమంతా అలా గడచిపోయింది.

అందరు పిల్లలవలెనే బడిలో చేరాను. ఇంటివద్ద సంగీతం మేష్టారుకి పాతిక రూపాయలు నెలనెలకు ఇచ్చి సంగీతం నేర్పించే వాళ్ళు. చదువుకూడా ఒకమోస్తరుగానే వచ్చింది.

అయితే అప్పటికి మధ్య తరగతి కుటుంబాలలో

సాంఘికమైన కట్టుబాట్లు ఛేదింప బడలేదు. నాన్నగారు ఆఫీసరైనా ఇంటివద్ద మడీ-దడీ, పూజా-పునస్కారమూ అమ్మ యేర్పాటు చేస్తూనే వుండేది. ఈ విషయాల్లో నాన్నగారు విశేషమైన ఆసక్తి చూపకపోయినా అమ్మ అభిమతానికి ఎప్పుడూ యెదురు చెప్పేవారుగారు. నాకు బాగా తెలిసిన తరువాత కూడా గొణుక్కుంటూనో, విసుక్కుంటూనో నాన్న మడిబట్టలు కట్టుకోవటం నాకు బాగా తెలుసు. అమ్మ పనిజరగటమే చూసుకునేది గాని నాన్నగారి సాధింపులనికూడా పట్టించుకునేదిగాదు. ఆమెది ఆదొక చిత్రమైన సంసారం. దానివలన ఎవరికీ ఏమీ బాధలేకపోయినా ఆరోజుల్లో కూడా కొంత మంది అమ్మను గురించి చాదస్తం అని వర్ణిస్తుండేవారు అమ్మ వేటినీ లెక్కపెట్టేదికాదు. ఆమెది అమాయక హృదయం. పవిత్రాత్మ ఒకరికి కష్టము కలిగించే ప్రవర్తనగాని, ఒకరి కష్టము కలిగించే మాటతీరుగాని ఆమె సర్వదా నిరసించేది. అయితే నరనరాన జీర్ణించి పోయిన ఆమెగారి పాతకాలపు సంస్కారం వలన నాన్నగారు కొంత బాధ పడ్డారు. నిత్యజీవితంలో ఆమె ఎంత పిచ్చిదంటే ఒక సంగతి గుర్తొస్తుంది.

మేము వుంటున్న ఇంటి ఎదురుగా పెద్దమేడ వుంది. వంట ఇంట్లోంచి చూస్తే రెండో అంతస్తు అంతా బాగా కనపడుతుంది. ఒక రోజు దొడ్లో జామచెట్టు కింద నిల్చుని చిలక కొరికిన పండ్లు యేరుతుంటే అమ్మ ఆదరాబాదరా పిలిచింది. ఏదో అవసరమైన పనివుండి అవతల ముంచుపోతున్నట్లు నేను వెళ్ళాను. అమ్మ పరవశంగా వుం

ఆకళ్ళలో ఏదో దైవత్వం తొణికిసలాడుతున్నది. అప్పుడు నాకు పధ్నాలుగేళ్ళు. పధ్నాలుగేళ్ళకల్లా నేను స్కూలు ఫైనలు ప్యాసైనాను. అంటే చిన్నతనంలోనే స్కూలు పైనలు అయ్యాయన్నమాట. ఏమిటమ్మా అని అడిగాను. ఆమె తేరుకొని ఎదురింటి మేడ మీద రెండో అంతస్తు వేపు చూపించింది.

నేను చూశాను. అక్కడ నాకేమీ కన్పించలేదు.

"ఏమిటీ?" అని మళ్ళీ అడిగాను.

"శ్యామసుందరుడు బాలకృష్ణుడు నాకు కనిపిందీ డమ్మా! అక్కడ. అచ్చం మురళి వాయిస్తున్నట్లుగా కనపడ్డాడు. నెమలిపించం కూడావుంది మౌళిన"అన్నది.

నాకు నవ్వొచ్చింది. మళ్ళీ ఇంతలోనే జాలి కలిగిందా ఔత్సుక్యమూ కలిగింది.

"నిజమా అమ్మా! అన్నాను. మా అమ్మకు నేనలా అడగటమే గొప్ప ఆనందాన్నిచ్చింది. "నిజంతల్లీ! ఇవాల్టికి నాజన్మ తరించింది. ఇవాళ్టికి నల్లనయ్య నన్ను కనికరించాడు. ఎంత చక్కగా వున్నాడు. అబ్బ!" "అని పరవశం చెందింది.

"అలా ఎక్కడైనా కనపడతాడా--నీది భ్రమ"-- అన్నాను.

అమ్మ కొంచెం బాధపడింది. "అలా అనకేతల్లీ! ఆమహానుభావుడు తలచుకుంటే కనపడడా?" అన్నది.

నాకూ్కడా నిజమేమోననిపించిది.

ఒక్కసారి మేడపైకి వెళ్ళి చూచి రావాలనిపించింది. అయితే అది కుటుంబాలుండే మేడగాదు, ఎవరో.

అమ్మ, నాయనమ్మా ఎప్పుడూ పోరు పెడుతూంటే ఇప్పుడిప్పుడే జామచెట్టు ఎక్కడం మానుకున్నాను. క్రిందటి సంవత్సరం వరకు రోజూ ఒకసారి చెట్టెక్కేదాన్ని. అటు వంటిది ఎవరూ చూడకుండా ఇవ్వాళ కూడా చెట్టెక్కి, రెండో అంతస్తులోకి చూచాను. అక్కడ ఒక కుర్చీమీద పెద్ద పిల్లవాడిఎత్తు కృష్ణవిగ్రహం నిలబెట్టి వుంది. ఆఫీసు జమాను దానికి అలంకారాలు చేస్తున్నాడులా వుంది. నాకు విపరీతంగా నవ్వు వచ్చింది. ఆ విగ్రహాన్నే అమ్మ చూసింది. ఆ కుర్చీ కాస్త ముందుకుండి దానిమీద ఆ విగ్రహం నిలబెట్టి వుంటారు. ఇప్పుడు మళ్ళీ దాన్ని కాస్త వెనక్కు జరిపినందు వల్ల అమ్మకా విగ్రహం మళ్లీ కనపడలేదు. అమ్మ అనుకుం టున్నది, తనకు రాధావల్లభుడు దర్శన మిచ్చాడని. అమ్మకుపోయి వున్నసంగతి యావత్తూ చెప్పి నవ్వాను. అమ్మకూడా నవ్వింది. ప్రపంచంలో ప్రతిదీ భ్రమే! అయితే ఆ భ్రమ సత్యమయినది కాదు అని తెలిసేటంత వరకు అపరిమితమయిన సుఖాన్నీ, సంతోషాన్నీ కలుగ జేస్తుంది. అది కాస్త భ్రమ అని తేలిపోతే, అప్పుడు అసం తృప్తికికూడా మేరవుండదు. అమ్మ విషయంలోకూడా అంతే అయింది. మళ్ళీ ఆమె మాట్లాడలేదు. ఆమెపని ఆమె చేసుకోనటంలో నిమగ్నురాలైంది. ఆమెకు కాస్త తృప్తికూడా లేకుండా చేశాను. భ్రమలోకూడా అందం లేకపోలేదు... అయితే ఆ అందం అది భ్రమఅని తెలి యనంతవరకే.-

నేను పధ్నాలుగోయేట స్కూలుఫైనలు ప్యాసు

కావడంఅనే విషయం ఇంట్లో ఒక సమస్యఅయి కూర్చుంది ఇంట్లో ప్రతిఒక్కరూ, వేర్వేరు అభిప్రాయాలు కలిగి వున్నారు. నా చదువును గురించి- ఇంకా పైకి చదివించా లని నాన్నగారి అభిప్రాయం. నాయనమ్మ వద్దని పోరు. అమ్మ ఏ విషయమూ చెప్పదు. అన్నయ్యకుకూడా యిష్టం లేదు. అన్నయ్య స్కూలుఫైనలు అప్పటికి ప్యాసుకాలేదు. అన్నయ్యకు చదువు బాగా అంటలేదనే చెప్పాలి. విపరీత మైన గారాబం వల్ల సగం చెడ్డాడు. మగపిల్లవాడు కావడం వల్ల యిష్టంవచ్చినట్లుతిరిగేవాడు. అందుకని వాడికి చదువు సరిగా అబ్బలేదు. నాయనమ్మ నాన్న కనబడినప్పుడల్లా "పిల్లదాని పెండ్లి చెయ్యి. నేనుచూసిపోతాను"అని మొదలు పెట్టేది.

నాన్న విసుకున్నా,ఆమె లెక్కపెట్టేది కాదు. "నీకేం తెలుసురా" అని యింకా కస్సునలేచేది. నా పెళ్ళి తొందరగా చేయటం అమ్మకుకూడా యిష్టమే. ఏది ఎలావున్నా నాన్నగారు నేను చదువుకోవడానికి అమ్మను మాత్రం వప్పించారుగానీ, నాయనమ్మను వప్పించలేకపోయారు. పైగా నొప్పించారు. ఆమె ఇంట్లోమనిషి కానట్లుగా ప్రతిదానికి విసుగుకొనడం సాగించింది. నేను కాలేజీలో చేరాను. కొత్తవాతావరణం. రకరకాల మనస్తత్వాలుగల పిల్లలూ మేష్టరూ, అంతా నన్ను ఆకర్షించారు.

ప్రపంచంలో ప్రతిదీ నాకోసమే అన్న భావనా, భవిష్యత్తుపై చెప్పలేని ఆశ, తీయని కలలూ, అమాయకత్వమూ, ముగ్ధత్వమూ, అన్నింటినీ కల్గొలుపుకుని బతికాము.

దేంట్లోనూ వెలితి కనబడేది కాదు. ఒకరోజువెళ్ళి, ఒక రోజు వస్తూంటే వంటికీ, మనస్సుకూ కొత్త ఉత్సాహమూ, కొత్తబలమూ వస్తూండేవి. కొత్త తేజస్సు వస్తూండేది. నాకు తెలీకుండానే రోజురోజుకూ విపరీతంగా నేను పెరిగి పోతున్నాను. అందరూ నన్ను విశేషంగా అభిమానిస్తు న్నారు. ఎంతో కాంక్షతో చూస్తున్నారు. కాలేజీలో మొదటి సంవత్సరం గడిచింది. చదువుల రాణిని కాక పోయినా, అంత వెనుకబడి వుండేదాన్ని కాను ఎప్పుడూ.

సెలవుల్లో నాయనమ్మకు పెద్దజబ్బుచేసింది. ఆ జబ్బులోకూడా ఎప్పుడూ పెళ్ళి విషయం కలవరిస్తూండేది. నాన్నగారు దిగులు పడ్డారు. నాన్నకుకూడా వాళ్ళమ్మంటే విశేషమైన ప్రేమ.

"సరేలే అమ్మా! ఈ యేడు పెళ్ళి చేస్తాను" అన్నారు నాన్న.

నాయనమ్మకు బ్రతుకుమీద ఆశ కలిగింది.

వెంకటేశ్వరస్వామికి ముడుపు కట్టుకుంది. లేచితిరగ నారంభించింది.

రెండో సంవత్సరంకూడా గడచి పోయింది.

నాన్న అక్కడక్కడ సంబంధాలు చూస్తూండేవారు. ఎవరెవరో వచ్చి అప్పుడప్పుడూ చూచిపోతూండేవాళ్ళు. నాకు విపరీతమయిన సిగ్గవుతూవుండేది. కష్టపడిచదివి, స్కూలు ఫైనలు ప్యాసయినాడుఅన్నయ్య. విసేపించి నాతో మాట్లాడే వాడుకాడు. ఏదికావాలన్నా అమ్మతోటే మాట్లాడేవాడు. నాన్నగారి ఎదుటపడికూడా మాట్లాడేవాడు కాడు.

నేను చనువుగా మాట్లాడబోయినా ముభావంగానే వుండేవాడు. నేను తనకంటే స్కూలుఫైనలు ముందుప్యాసు కావడం, కాలేజీలో చేరటం. అతను సిగ్గుపడటానికి కారణ మయినాయ్. నాస్నేహితురాళ్ళెవరైనా ఇంటికొస్తే అప్పుడే పారిపోయేవాడు ఇంట్లోంచి.

ఏమైనా కావాల్సుంటే తనఅభ్యర్థనను అమ్మద్వారా నాన్నకు అందించేవాడు. నాన్న నవ్వి మంజూరుచేసేవాడు. స్కూలు ఫైనలు ప్యాసయిన తర్వాత చాలా రోజులు నేను చదువుకోను అంటుండేవాడు. ఎలానైతేనేం కాలేజీలో చేరాడు. కాని చదువుమాత్రం సరిగా సాగనివ్వటంలేదు.

ఒకరోజు మా యింటికి చూసిపోదామని ఎవరో వచ్చారు పెళ్ళి సంబంధం తాలూకు. ఆయనకు అన్నయ్య స్నేహితుడేనట. అన్నయ్య పూర్వము అప్పుడప్పుడు వాళ్ళ సంగతి చెపుతుండేవాడు.

అమ్మకు నచ్చింది. నాయనమ్మ దగ్గరకువెళ్ళి- పరి శీలనగా చూస్తుంటే ఎంతఆపుకుందామన్నా నవ్వు వచ్చి నవ్వాను. ఆయన నన్నుచూసి నవ్వారు. ఇప్పుడా విషయా లన్నీ తలపుకువస్తే కన్నీళ్ళు ఆగవు. చెప్పలేను.

ఆయన మధురంగా నవ్వగలరు. ఆయన నవ్వును ఒకసారి అనుభవించిన వాళ్ళు ఆయనను ఆజన్మాంతమూ మరచిపోలేరు. శీతాకాలపుయెండ ఉదయాన్నే శరీరానికి ఎంతసౌఖ్యాన్నిస్తుందో అటువంటి సౌఖ్యంవుంది- ఆయన గారి నవ్వు ననుభవించటలో. ఆయన దేవతామూర్తి.

నాన్నగారు నన్ను ఒక్కదాన్నీ వేరుగా పిలిచి అడి

గారు. చెప్పలేని సిగ్గయింది. ఎలా తెలియ చెయ్యాలో తెలియక భయపడ్డాను. ఇష్టంలేదనుకుంటారేమోనని భయం పుట్టింది. తలవంచుకుని చాలాసేపు నిలబడ్డాను.

"అయినా యిప్పుడేం తొందర ? ఇంకా రెండేడ్లు పోతే మాత్రమేం ?" అన్నారు.

నాకు ఎంతైనా విచారం కలిగింది.

"నాకు యిష్టమే నాన్నా!" అని పరుగెత్తుకుని వెళ్లాను. నాయనమ్మకు ఆవాళ నామీద అమితమయిన ప్రేమ పుట్టుకొచ్చింది.

అప్పటికప్పుడే ఆ సంబంధం స్థిరమయి ది.

నాకు పదహారవయేట పెండ్లయింది. పరీక్షలకుకూడా వెళ్ళలేదు. నాకేమీ అసంతృప్తిలేదు. హాయిగా జీవించాను చదువుమానుకున్నా.

నాయనమ్మ పంతం పెట్టుకున్నట్లుగా యిదివరలో అంటూ వున్నట్లు యేడాది గడువక మునుపే చనిపోయింది. నేను అత్తగారింటికి వెళ్ళాను. అయితే, అయన చివరి సంవత్సరపు చదువుపూర్తికాలేదు కాబట్టి ఒకమూణ్ణెల్లు యిక్కడా వుంటుండేదాన్ని. అక్కడనాకు పెద్దవాళ్ళు ఎవరూ లేరు. అత్తా మామా ఎవరూలేరు. బావగారే ఆయనకు విద్యా బుద్ధులు చెప్పించి, పెద్దవాణ్ణిచేశారు. ఆడబిడ్డ ఒకామె వుంది. ఆమె చాలా మంచిది. ఆయింట్లో వాళ్ళంతా అంతే. వాళ్ళ వున్నతులు, వాళ్ళ సంస్కారం అలాంటిది. తరువాత నాకు తెలిసింది. అత్తయ్య చనిపోతూ, బావగారి చేతులలోపెట్టి పోయారట ఆయనను. ఆయన

తనమీద పెట్టబడిన బాధ్యతను నిర్వర్తించుకున్నాడు. ఆమెకూడా ఎన్నోవిధాల భర్తకు సాయం చేసింది. వాళ్ళ ఎదుట ఆయన తలకూడా ఎత్తేవాడుకాదు. నాకు మొదలు ఆశ్చర్యమయింది. ఒకటి, రెండుసార్లు బుద్ధిలేక అడిగాను "పెద్దవాళ్ళకు అణకువగా వుండటంలో తప్పులేదు." అని చిరునవ్వుతో సమాధానం చెప్పారు. అయితే నేనూ మనుష్యమాత్రురాలినేగదా! దురహంకారంవల్ల కళ్ళుకప్పుకు పోయినై. విశేషించి మా నాన్న, ఆయనకు కట్నరూపంలో చాలా ఎక్కువ మొత్తమే ముట్టచెప్పారు. అదికూడా నా దురభిమానానికి ఒక హేతువే అయింది. పైన ఆర్థికంగా వాళ్ళ అంతస్తుకంటే మా అంతస్తు ఎన్నోరెట్లు యెత్తున వున్నది. నా ప్రవర్తనను నేను సరిదిద్దుకోలేకపోయాను. ఇంట్లోవాళ్ళు నన్ను ఒక్కమాటకూడా అనేవారుకాదు. మాతోటికోడలు ఒక దేవత. ఆమెలాంటి అంతఃకరణగల వ్యక్తులు యీ ప్రపంచంలో బహు సకృతుగా కన్పిస్తారు. నన్ను కూతురిలా చూసేది.

ఒకసారి ఆయన సెలవులకని ఇంటికి వచ్చారు. అప్పుడు ఆ యింట్లో అందరిచేత, నా ఆధిక్యతను గుర్తింప చేయాలని నేను అజ్ఞానంతో ప్రవర్తించాను. ముఖ్యంగా బావగారి మనస్సు బాధపడ్డది. ఆయన కోపంతో నీముఖం చూడను అన్నదాకా లేచారు. అప్పుడు బావగారి ఔన్న త్యం నాకు బోధపడింది. ఆయన అన్నంతపని చేస్తారేమో నని భయమేసింది. కాళ్ళుపట్టుకుందామన్నంత తపనకలిగింది. నా ప్రవర్తన పూర్తిగా సరిదిద్దుకున్నాను. ఏడాది గడిచింది

ఆయన చదువుపూర్తయింది. కాలేజీలో వుద్యోగం దొరికింది. నా జీవితంలో అతి కరుణాన్వితమైన సంఘటన జరిగింది. ఇటువంటి సంఘటనలు అసహజంగా కన్పించినా.- అసంభవం మాత్రం కావు. కథల్లో యిటువంటి సంఘటనలు బాగా కనిపిస్తూంటవి. ఇలాంటి సంఘటనలు జరుగకపోతే కథలే వుండవు. అందువలన యిలాటి సంఘటనలన్నింటినీ కేవలం కల్పన క్రింద త్రోసి పారవెయ్యడానికి వీలులేదు. కథలుకూడా కొందరువ్యక్తుల జీవితాలేగా! అయితే ప్రపంచం చాలా మారిపోయింది కాబట్టి ప్రతిచిన్న సంఘటననీ, హేతువాద దృష్టితో పరిశీలిస్తున్నారు. వాటికి కొత్త విలువలని నిర్ణయిస్తున్నారు. కర్మ, విధి, పూర్వజన్మ, చేసుకున్న పాపం, పుణ్యం, దురదృష్టం యిలాంటి మాటల కన్నింటికీ విలువలేకుండా పోతున్నాయి. కొత్త విలువలు నిర్ణయిస్తున్నారు. అయితే యాదృచ్ఛికంగా కథలలో జరిగే సంఘటనలే నిత్యజీవితంలోనూ కన్పిస్తున్నాయి. చెరసాలలు, ఉరికొయ్యలు, నిత్యజీవితంలోనూ ఉన్నాయి. రైళ్ళు పడిపోతూనూ వున్నాయి. విమానాలు కూలిపోతూనూ వున్నాయి. తరుణ హృదయాలు బ్రద్దలవుతూనూ వున్నాయి.

ఆఫీసునుండివస్తూ నాన్నగారు కారులోనే గుండె ఆగి చనిపోయారు. నాకు దిక్కులు కదిలినట్లనిపించింది. పైన ఆకాశం, క్రింద భూమి కనబడలేదు. మేమూ వెళ్ళాము అక్కడకు.

అమ్మ హోరుమని ఏడ్చింది.

ఇలా ఎందుకు జరిగింది అని ఎంతోమంది యింటూ,

బయటా చర్చించుకున్నారు. అయినా దీనికి సమాధానం ఎవరు చెబుతారు? ప్రపంచంలో ప్రతి విషయమూ సహజమే. ప్రతివిషయమూ అసహజమే.

ఎంతోమంది ఎన్నోరకాల ఓదార్చి పోయారు. ఎన్ని ఓదార్పులయినా అమ్మ హృదయంలోని మంటను ఎలా ఆర్పగలవు? ఈ ప్రపంచానికి అమ్మ తనముఖం ఎలా చూపగలదు? మూడు రోజులు అమ్మ అలానే గడిపింది.

ఎంత ఆశ్చర్యకరమైన విషయం.

అమ్మఏదో నిశ్చయించుకున్నట్లుగా దుఃఖం దిగమింగింది. అన్నయ్య పిచ్చివాడులా అయిపోయినాడు. యథావిధిగా జరగవలసినదంతా జరిగింది. అమ్మ అన్నది.

"అవునే కమలం మనం బజారులో వాడికి ఇత్తడి సామాను బంగారు 'ఆభరణాలుచేసి ఇవ్వమంటే ఎలా యిస్తారు! నేను చేసిన పూజకు నాకిదేఫలం విధించాడు. ఇదంతా వెర్రి. ఈ ప్రపంచంలో మనదేముందే - మనం చేసుకోందే ఆయనేం చెయ్యగలడు? అయినా ఇక ఏముంది? నాకు యీరాత తప్పలేదు. అంతే - ఈ కొద్దికాలం అనుభవించక తప్పదు. ఎట్లాగూ ఇంక నేను ఎన్నాళ్ళు వుంటాను"

''నాకు విపరీతంగా యేడుపు వచ్చింది. అమ్మ ఒళ్లో ముఖందాచుకు యేడ్చాను.''

అమ్మ చెప్పింది.

"దేనిమీద నూ వ్యామోహం కూడదమ్మా! ఏది ఎలా జరగాల్సివుంటే అలాజరుగుతుంది. కష్టాలు భరించగలగటంకంటే గొప్పదైన తపస్సు యీ పంప్రపంచంలో

వేరేదీ లేదు. ఎంత కష్టాన్నైనా ఓర్పుతో భరించాల్సిందే. ఈ ప్రపంచంలో మనదీ ఒక కష్టమే! నిజంగా కష్టాలు పడేవాళ్ళముందు మనకష్టం యెంతటిదమ్మా."

అమ్మ ఆరోజునుంచీ పూర్తిగా మారిపోయింది. ఒక్కపూటనే భోజనం. అదయినా వారానికి మూడురోజులు ఉపవాసం. పూర్తిగా చిక్కి శల్యమైపోయింది. ఎవరితోటి మాట్లాడేదిగాదు. పూజాగృహంలో నిర్విరామంగా గంట మోగుతూ వుండేది. కర్పూరం వెలుగుతూవుండేది. సన్నటి గొంతున అమ్మ రాధాస్వామిని గురించి పాటపాడుతూ వుండేది. యేడాది గడచిన తర్వాత ఎవరి ప్రమేయమూ లేకుండా అన్నయ్య పెండ్లి చేసుకుని వచ్చాడు. చిన్నప్పటికీ పఇప్పటికీ ఎంతో మారిపోయాడు. ఊళ్లో వాళ్ళంతా ఎంతో సంస్కరణ వివాహం అన్నారట. అమ్మ హృదయంలోని బాధ వాళ్ళకేం తెలుసు. పత్రికలలో వార్తలు పడ్డాయి. కొంత మంది వాడి స్నేహితులు సంతోషించారు.

నేను దూరంగానే వుండి, ఇవన్నీ చూసి, కన్నీళ్ళతో భరించాను. భరించక ఏమిచెయ్యను? నేను అస్వతంత్రురాలిని. కాకపోతే అమ్మను నాదగ్గరకు వచ్చివుండమని కోర గలను. అందుకు ఆయనకుకూడా ఎటువంటి అభ్యంతరమూ వుండదు. కాని అమ్మరాదు. రాలేదు. ఎంత మొత్తుకున్నా రాలేదు. ఒకరోజు సర్వంముగిసిపోయింది. ఇదివరకే అమ్మ నాకు వ్యామోహం కూడదని హితబోధ గరిపి వుంది.

ఒక్కసారి యేడ్చి సర్వం ఒక పీడకలలాగా భరించాను. నాకు తెలుసు-ఏ నాటికైనా ఇలాంటి యెడబాటు

తప్పదు. ఎవరు ఎవరికి శాశ్వతంకారు. అందుకని ఒకరి కొకరు బంధింపబడకుండా వుండలేము. మన సంస్కారం అలాంటిదీ.

అన్నయ్య హృదయం ఎలాటిదో అంతబాగా నాకు తెలీదు. బుద్ధీ, జ్ఞానమూ పొందినప్పటినుంచీ వాడు నాకు దూరంగా తిరగటం ప్రారంభించాడు. ఇప్పుడు మరీ దూర మైపోయినాడు.

అన్నయ్య నాకు ఆస్థిలో భాగం పంచిపెట్టాడని కొద్ది రోజుల తర్వాత నాకు తెలిసింది. నా ఆశ్చర్యానికి మేరలేక పోయింది. ఆ మాటవిన్నప్పటినుంచీ అన్నయ్యను కొన్నాళ్ళు నాదగ్గర అట్టిపెట్టుకుందామని ఒకటే యిదిగా అనిపించింది. నాన్నగారు మాకు ఏమీ తక్కువచేసిపోలేదు. కేవలం అన్నయ్య దయాధర్మాలనుకూడా నే నాశించవలసిన అవ సరం నా కసలే లేదు. నాకు ఇవ్వదలుచుకున్న దేదో నాన్న గారు యీపరకే యిచ్చిపోయినారు. మరి అన్నయ్య ఎందు కిలాంటిపని చేసాడు. ఆయనేవచ్చి వుత్తరం చదివి వినిపిస్తే నమ్మలేక పోయాను.

అభిమానంతో వేగిపోయినాడు. ఆయనగారి ద్వారా అన్నయ్యకి ఉత్తరం వ్రాయించాను పదిరోజు లుండి పొమ్మని. దాని కన్నయ్య సమాధానం వ్రాశాడుకాని రాలేదు

అన్నయ్య సంస్కరణోద్దేశాలు కలవాడే అని మళ్ళీ అందరూ అన్నారు. నాకు నిజమేననిపించింది. నేను ఇతర విషయాలేమీ ఆలోచించ లేకపోయాను అన్నయ్యఎవరికీ

చెప్పా పెట్టకుండా, అమ్మకు దుఃఖం కలిగించి ఎవరినో పెళ్ళి చేసుక రావటం అనే విషయాన్నికూడా క్షమించ గలిగాను. బహుశా అన్నయ్యనాకు ఆస్తి పంచి ఇవ్వటం వల్ల నే, నేను అలా ఆలోచించ గలిగానేమో చెప్పలేను.

సరే నా జీవితానికి ఎలాటి వెలితీలేదు. కొన్నికొన్ని యీ అవాంతర దుఃఖ సంఘటనలు ప్రతి జీవితానికీ మామూలేకదా అని సరిపెట్టుకున్నాను. నేనే సర్వస్వం అని ప్రేమించ గలిగిన భర్తా, ఇంట్లోఅందరి ఆదరణా నాకు సంభ వించిన, యీ చిన్న చిన్న దుఃఖవేగాలను తగ్గించాయి. కొన్నాళ్ళపాటు హాయిగానే బ్రతికాను. ముందు వచ్చే అవాంతరాలను ఎవరూ వూహించలేరు గనుక.

మళ్ళీజీవితంలోఇంకో అవాంతరసంఘటన. అన్నయ్య మీద అతడు చేసుకొచ్చినావిడ కోర్టులో దావా వేసింది. మా బ్రతుకు వెలితిపాలైంది. నాన్నగారు ఎంతవున్నంతగా బ్రతికారో వాడు అంత వెలితిపాలవుతున్నాడు. ఎవరైనా ఇలా జరుగుతుందని వూహించగలరా? ఒక మెడికల్ ఆఫీసరు గారి ఏకైక పుత్రుడు చదువు సరిగాఅబ్బక, జీవితంలో ఒక రకమైన కష్టాలనుభవిస్తూ అడుగడుక్కూ అవాంతరాల నెదు ర్కొంటున్నాడు, తరువాత నాకు తెలిసింది. నా మూలకం గానే వాడికీ కష్టంవచ్చిదంని, నాకు ఆస్తి పంచియివ్వటం ఆమెకు ఎంతమాత్రమూ ఇష్టంలేకపోయినప్పటికీ అన్నయ్య యీపని చేశాడని. అందువలన వాళ్ళలో కలతలు రేగా యని లోకులు ఎన్నిరకాలైనా అనుకుంటారు. ఉన్నవీ లేనీవీ కల్పించగలరు. ప్రచారం చేయగలరు. నిజమని నమ్మేట్లు

వత్వం వున్నదా? అంత అతిశయమూ, అంతగర్వమూ, అంత అహంభావమూ-ఆమెకు ఎందుకో? ఆమెను ఎప్పుడూ నేను చూడలేదు.

ఆమెలో ఇంత నిర్దయ వుందని ఆమె ఫొటో చూసినప్పుడు నేను అనుకోలేదు. ఆమె ఉద్దేశము ఏమిటో బోధపడటంలేదు.

ఎవరినో చెప్పా పెట్టకుండా చేసుకుని వచ్చాడని విన్నప్పుడు నేను అంత ఎక్కువగా బాధపడలేదు. తరువాత ఆమె ఫొటోలు చూసినప్పుడు అన్నయ్య అలా ఎందుకు చేశాడో కొంత ఊహించుకోగలిగాను. ఆమె అసామాన్య సౌందర్యవతి. అదే నేను చూడగలిగాను కాని ఆమె హృదయం ఇంత నిస్సారమైనదిగా నేను గ్రహించలేకపోయాను. ఎలా అయితేనేం అన్నయ్య జీవితం వక్రమార్గాన పడ్డది. ఇక అతని జీవితపథం సాఫీగా సక్రమంగా సాగిపోవటమంటూ వుండదు.

నేను అన్నయ్యకు వుత్తరం వ్రాశాను. దీనంగా.

వచ్చి పదిరోజులుండిపొమ్మని. కాని అన్నయ్య రాలేదు. వివరంగా ఉత్తరం మాత్రం వ్రాశాడు. దాంట్లో ఇలా ఎందుకు జరిగిందో వ్రాశాడు.

అప్పటికే శలవులు చాలా అయిపోయినాయనీ, ఇంకా శలవు పెడితే ఉద్యోగంలోకూడా చిక్కులు కలుగుతాయనీ వ్రాశాడు. ఆమెను గురించి వ్రాస్తూ - "ఇది ఆమె స్వయం నిర్ణయమని నే ననుకోను లొంగిపోయే స్వభావం కాకపోయినా ఇంత అజ్ఞానంలో పడిపోతుందని

నే ననుకోలేదు. వెళ్ళి నేనే తలవంచి, అన్నీ మర్చిపోయి నాతో వచ్చేసెయ్యమన్నాను. అది ఆమెకు అవమానకర మట. నన్ను తృణీకరించిన ఆమెనుఇంకా నేనేమని ప్రాధేయ పడను? వచ్చేశాను. ఏనాటికైనా ఆమె తనతప్పును తెలుసు కోగలుగుతుంది. కాని అప్పటికి చాలా ఆలస్యం కావచ్చు. జీవితాలే వుండకపోవచ్చును. నేనేమిచేయగలను!" అని వ్రాశాడు అన్నయ్య. నాకు యేడుపొచ్చింది. నేనేంచెయ్య గలను?

తరువాత అన్నయ్యకు ఆవూరునుంచి ట్రాన్స్ఫర్ అయింది. వెళ్ళిపోయాడు.

చిట్టికి రెండేళ్ళు వచ్చాయి. ఇప్పు డిప్పుడే మాటలు నేర్చుకున్నది. జీవితంలో అసంతృప్తి అధికభాగం పీడిస్తున్నా కొంతలో కొంత సుఖసంతోషాలు లేకపోలేదు.

వెలుగూ చీకట్లవలెనే జీవితానికి సుఖ దుఃఖాలు. ఈ సత్యం తాతలనాటినుంచీ ప్రతివారూ యెరిగివున్నదే — అయినా ప్రతివాళ్ళూ యీ సుఖ దుఃఖాల గురించి ఒకటే ఇదిగా చర్చించుకుంటూనే వున్నారు.

అంత చిన్నతనంలోనే నేను జీవితసత్యం ఒకటి కను క్కొన్నాను. నేనుకనుక్కొన్నాననటం నిజంకాదు. అమ్మ చెప్పిపోయింది. అమ్మచెప్పిపోయిన ఆ సత్యంగుప్తంగా హృద యంలో దాచుకున్నాను. ఎప్పుడైనా బాధ అనిపిస్తే, హృద యంలో వుద్వేగం కలిగితే అమ్మ చెప్పిన మాటలే నాకు గుర్తొస్తాయి. "కష్టాలను భరించవలసిందేనమ్మా! మాన వులకి యెండా వానలు యెంత సహజమో, కష్టాలు కన్నీళ్లూ

కూడా అంతే సహజమైనవి."

ఆ సందేశం నా హృదయంలో బలంగా నాటుకొని వుండక పోయినట్లయితే నేను ఇంతకాలం బ్రతకగలిగేదాన్ని కూడా కాదు. అయితే ఇదంతా వేదాంతమని ఎవరైనా పరిహసిస్తారుగాక. పరిహసిస్తే పరిహసించనీ. జీవితపు విలువలు వాళ్ళకు తెలీదని నేననుకుంటాను.

గడచిపోయిన జీవితం ఎడారివంటిది. అనుభవంతో జీవితంలో ఎన్నో సత్యాలను తెలుసుకున్నాను. నాలుగైదేళ్ళలో నలభైయేళ్ళ దాన్నవుతాను కామోసు!

ఎన్నో చిక్కుదార్లలోంచి, ముళ్ళదార్లలోంచినడచి వచ్చాను. కాళ్ళు గీసుకుపోయి రక్తసిక్తాలైనాయి. కళ్ళ నీళ్ళు అవిరామంగా ప్రవహించాయి. ఎప్పుడూ గుండెల్లో ఇదే ప్రశ్న మెదిలేది.

ఇలా ఎందుకు జరిగింది ? ఇలా ఎందుకు జరుగుతున్నది? అని.

కాని దానికి సమాధానంఎవరుచెప్తారు. జీవితంలో ఎన్నెన్ని అవాంతర సంఘటనలు వచ్చాయి. నేను కోలుకోలేనిదెబ్బ ఒకటి తగులుతుందని నేను కలలోకూడా వూహించలేను. ఈ బంధం యింతటితో నామరూపాలు లేకుండా తెగిపోతుందని నేనెలాఅనుకోగలను? అన్ని మంత్రాలువుట్టివే గాలిలో కలిసిపోయినాయా-- మరి అవి నిష్ఫలములా? అంతా ఒట్టిమాయ, మిథ్యా అన్నమాట. "మమజీవం హేతునా..." అని పురోహితుడు ఆయన నోటివెంట చెప్పించిన రోజున ఎంతగా పొంగిపోయాను. హృదయమంతా

క్షీరవారాసిలా పొంగి పొర్లి పోలేదా! ఆయన పాదాలు అందరి ముందరా కళ్ళ కద్దుకుందామనిపించలేదా?

కాని యింక యీ జీవితంలో మిగలవలసిన దేమీ లేకుండా అంతాపోయింది. ఈ సంఘటనను వర్ణించి వర్ణించి చెప్పలేను. దగ్గర దగ్గర పదిహేనేళ్ళు కావస్తోంది ఇది జరిగి కూడ. నేను యథా తథంగా చెప్పలేనుకూడ! అనుకుంటేనే ఇన్నాళ్ళ తర్వాతకూడా నా హృదయం దుఃఖంతో బరువెక్కుతుంది.

నాలుగు రోజులు జ్వరంవచ్చింది. ఆనాలుగురోజులు పగలూ రాత్రీ క్షణంకూడా కన్ను మూయలేదు. ఐదో రోజున ఆయన కన్నుమూశారు. ఇలాంటి సంఘటనలువాస్తవికమైనవి కావని అంతాఅనుకుంటారు. కష్టాలమీద కష్టాలు వచ్చిపడి నలిగిపోయి బతుకు బాటలో బాధలు పడుతుంటే సినిమాలలో చూసినా మనహృదయాలు ఆర్ద్రితతో బరువెక్కుతాయి. కాని నిత్యజీవితంలో ఇలాటి సంఘటనలని వూహించలేరుకదా? కాని ఇంతకంటె భయంకరమైన సంఘటనలనేకదా ఈ స్వల్పానుభవంలోనే నేను చూశాను. నాలుగేళ్ళ తర్వాత మావీధిలో ఒక ముసలమ్మవుండేది. లేవలేదు. కూచోనులేదు. పండుటాకువలె యెప్పుడైనా రాలిపోవచ్చునామె. ఆమెకు ఒక్కగా నొక్క కొడుకున్నాడు. అతనికి ఇరువై యేళ్ళ కన్న యెక్కువవుండవు. ఒకరోజున ప్రమాదవశాత్తూ నీళ్ళుతోడుతూ అతడు పెరట్లో భావిలో పడి చచ్చిపొయ్యాడు.

ఈ విషయం చెపుతుంటే నమ్మశక్యం కాకుండా

వుందనుకుంటారు. ఇది జరిగింది. ఇరుగు పొరుగువాళ్ళు ఆ కుర్రవాడి శవాన్ని భావిలోనుండి తీసి ఆ ముసలావిడకు చూపించారు వాణ్ణి కౌగలించుకొని వదలిపెట్టలేదు. బలవంతాన తీసుకపోయారు. ఆమెకు మతిచెడింది. ఇప్పటికీ వీధిలో కూచుని కొడుకుకోసం ఎదురుచూస్తుంటుంది. ఎవరైనా ఆవీధిని కనబడితే దగ్గరకు పిలిచి కొడుకునుగురించి ఏవేవో చెపుతుంది. వాడికోసమే ఎదురుచూస్తూ కూచున్నానంటుంది. "ప్రొద్దుననగా పోయినాడు నాయన, యెండకుతిరుగుతున్నాడు. గొడుగు తీసుకపోరా అంటే తీసుకపోడు. నాయనకోసం పెరుగుపచ్చడి చేశాను. అదుగో నాయన వస్తున్నట్లున్నది" అంటుంది. ఇదంతా ఎందుకు చెపుతున్నానంటె జీవితంలో విధురత్వము ఎంతవరకు వుంటుందో చూపటానికే. అప్పుడు అమ్మ చెప్పిన విషయం నాకుగుర్తొస్తుంది. అప్పటికీ ఎప్పటికీ ఆ విషయం నాకు గుర్తొస్తునే వుంటుంది. ఆమె సందేశం నాహృదయంలో పదిలంగా వుంటుంది. ఆవాళ నేనుచైతన్యం లేకుండానే వున్నాను. నా స్వామి నాకుదూరమైనాడు. నేనెందుకు బ్రతకటమనిపించింది.

"చావలేక" అని సమాధానం వచ్చింది.

"ఎందుకు చావలేవు" అని ప్రశ్న.

"చిట్టికోసం" అని సమాధానం.

చిట్టి ఎంత బెంగపడిపోయింది. నా దుఃఖంలో దాని ముఖమే చూడలేక పోయాను. కళ్ళంతా పీక్కుపోయి మృత్యువువేపు చూస్తున్నట్లయిపోయినాయి నా తల్లికళ్ళు.

నాహృదయానికి హత్తుకున్నాను. నాతల్లీ నీకోసం బ్రతుకు తాను. ఏం చెయ్యగలను ? చీకటిలో నదిలో నావస్తువు జార విడుచుకున్నాను. నది ఒడ్డునకూచుని ఎన్ని రాత్రులు ఎన్ని పగళ్ళు గడిపినా నావస్తువును నేను పొందలేను. ఈ చీకట్లు ఏన్నటికీ చీల్చబడవు. ఈ తడబడేకాళ్ళు ఎన్నటికి స్థిరంగా నిలబడలేవు. ఈ వణుకు ఇక తగ్గదు. మానసికంగా-అప్పుడే నాకు ముసలితనం వచ్చేసింది. అన్నయ్యవచ్చాడు.

అన్నయ్యకు నా మొహం ఎలా చూపించను? మా ఇద్దరి జీవితాలు ఇలా అయిపోయినా యేమి? అన్నయ్య చిన్నపిల్లవాడిలా బావురుమని యేడ్చాడు. ఒకరినిచూస్తూ ఒకరం అలా యేడుస్తూ యేంతసేపు గడిపామో! మధ్య మధ్య చిట్టి తలపుకు వచ్చినప్పుడల్లా యేడుపుదిగమ్రింగు కునేదాన్ని.

అన్నయ్య తనతో రమ్మన్నాడు.

ఒక పదిరోజులు గడవనీ - అన్నాను.

అన్నయ్య వెళ్ళిపోయినాడు వారంరోజుల్లో వస్తానని. నేను మొండిదాన్ని. ఒంటిగా ఆలోచించి ఒక నిర్ణయానికి రాలేనని అనుకున్నాను.

బావగారూ తోటికోడలూ కుమిలిపోయారు.

వాళ్ళు తమ వద్ద వచ్చివుండమని చెప్పలేక సతమతమైనారు. ఇకనేను ఆఇంట్లో ఎలానూ వుండలేను. ఆసంగతి నాకు తెలుసు అన్నయ్య అప్పుడు గుంటూరుర్లో వుంటున్నాడు. నేను విశాఖపట్నం వెళ్ళాను. అక్కడ నాతో చదువుకుని ఆడపిల్లల స్కూల్లో హెడ్ మిస్ట్రెస్‌గా పనిచేస్తున్న

ఒక స్నేహితురాలు వుంది. ఆమె ఏదైనా ఆదరవు చూపిస్తే అక్కడే వుండిపోదామని సంకల్పించాను.

నా స్నేహితురాలు నన్నుచూసి చాలాజాలిపడింది. పాపం నేనుస్కూల్లో చేరటానికి శాయశక్తులా కృషిచేసింది. కేవలం భుక్తికోసమే కాకపోయినా నిర్వ్యాపారతను వదల్చుకుందామనే ఉద్దేశం నన్నల్లా ప్రేరేపించింది. ఉట్టినే కూచుంటే తల తిరిగిపోయే ఆలోచనలు! పిచ్చెక్కుతుందేమోనని భయమయ్యేది. క్షణంసేపు కూర్చోలేక పొయ్యేదాన్ని పురాస్మృతులు అడుగడుగునా కలచివేసేవి. ఆబాధపడలేక స్కూల్లోచేరిపొయ్యాను. అయితే తొందరలో చిట్టివిషయమై ఆలోచించ లేకపోయాను. ఎట్లా ?

క్షణక్షణానికి వీధిలో ఒక్కగా నొక్క కొడుకుని పోగొట్టుకున్న వృద్ధురాలు గుర్తొచ్చి మనసు వికలమైపోయేది. ఆమె మాటలే గుర్తువచ్చి మనసు రేగిపోయేది. పదిగంటలకు బడికిపోతే ఒంటిగంటకుగాని ఇంటికిరాను. మళ్ళీ మూడు గంటలకి పోతే పదవుతుంది ఇంటికి వచ్చేసరికి.

మొదట నాలుగురోజులు ఆ స్నేహితురాలింట్లోనే వుండి బడికిపోయేదాన్ని. ఆమె ఇంట్లో పిల్లల సంరక్షణకు గాను ఒక ముసలమ్మ వుంది.

చిట్టికూడా ఆ నాలుగైదు రోజులూ ఆమె సంరక్షణలోనే వుంది. మాకు దూరపు బంధువు ఒక మామ్మగారుండేది. ఆమె ఇప్పుడు వున్నదీ లేనిదీకూడా తెలియదు. ఆమెకు ఉత్తరం వ్రాసి పిలిపించుకుందామని ఉద్దేశపడుతూ వున్నాను. ఇంతలోకి అన్నయ్య వచ్చాడు. అవాళ ఆది

ారం. అన్నయ్య వచ్చాడుకదా అని మా ఇంటికే వచ్చే శాము. ఇల్లు అద్దెకువున్నా రెండుగదులుమాత్రం ఖాళీగానే వుంచాడు అన్నయ్య.

ఆవాళ అన్నయ్య మాట్లాడుతూనే వున్నాడు. నా హృదయమైనా కాస్త గట్టిది. వాడు అంత ఆర్ద్రహృదయు డని యీావరలో నాకు తెలీదు. "నువ్వు ఉద్యోగంచేసి బ్రతు కుదామనుకుంటున్నావా? నేనుకూడా చచ్చిపోయానను కుంటున్నావా?" ఇవే మాటలు పదేపదే ఆరోజంతా అన్నాడు. క్షణక్షణానికీ బావురుమని చిన్నపిల్లవాడిలా యేడ్చేవాడు. నామాట అసలు వినిపించుకునేవాడేకాదు. నేను యీా వుద్యోగంలో చేరటం అన్నయ్యకు ససేమిా ఇష్టంలేదు. తనతో వచ్చివుండమంటాడు. ఎంతచెప్పి చూచినా లాభంలేక పోయింది. తాను గనక రాకపోతే అన్నీ వదులుకుని దేశాలపాలవుతానని చెప్పాడు చివరకు.

ఇక నేను ఏమాత్రమూ వాడికోరికను తిరస్కరించ లేక పోయాను. అవును వాడికిమాత్రము ఇక ఎవరున్నారు? నేను నిజంగా నావ్యక్తిత్వం నిలబెట్టుకునేందుకు, నా బ్రతుకు నే బ్రతికేందుకు ఇక్కడే వుండిపోయినట్లయితే వాడు దేశాల మిాద పోయివుండడని ఎవరుచెప్పగలరు?

ఇంత కష్టాలొచ్చి నేను కళ్ళముందు లేకుండా తన జీవిత నాటకంలో అన్నీ విషాద ఘట్టాలే అయిన తర్వాత ఎదేశానికో పారిపోడని ఎలా అనుకోగలను? బయలుదేరి అన్నయ్యతో వెళ్ళిపోయాను. వచ్చేప్పుడు నా స్నేహితు రాలు చాలా బాధపడింది.

ఎన్నో చెప్పింది.

స్వయంశక్తితో కాలూని నిలబడ గలగటమే చాలా మంచిదని హెచ్చరించింది. "అన్నయ్య ఇవాళ నిన్ను అభిమానిస్తున్నాడు. ఈ అభిమానమూ, ప్రేమా స్వచ్ఛమైనవి కావు — అని నేననను. అయినా కష్టాలకు వ్యక్తులలో యీ ప్రకృతి సహజం. రోజులు గడచినకొద్దీ ఇప్పుడున్న మన సత్వం పాదుకొని అలానే వుండగలదని ఎలా చెప్పటం, అయితే నిన్ను అనాధను చేస్తాడని గాదు నేననటం. చెప్ప లేము. మనమంతా మానవ మాత్రులమే కదా" అన్నది.

ఆమె మాటల్లోని అంతరార్థం నేను గ్రహించ లేక పోలేదు. నేనూ అనుకున్నాను. "ఇంకనన్ను ఎవరు అనాధను చేసేదేమున్నది నేను అనాధనయ్యే వున్నాను."

అన్నయ్య శాశ్వతంగా ఆదరించక పోయినంతమాత్రాన యీ రోజున నేనుపడిన కష్టంకన్నా నష్టంకన్నా ఎక్కువ ఆపద నాకు సంభవించదుకదా ?

ఈ అభిమానమూ, ఆదరమూ ఒకరోజునఅన్నయ్య హృదయంనుంచి మాయమై పోతవని నేను ఆలోచించను. ఆలోచించలేను.

అందువలన ఆమె సహృదయతతో నా కొసగిన సలహాను నేను మన్నించలేకపోయాను.

ఆమె చివరకిలా అన్నది. "పోనీ నాకు ఇలావాగ్దానం చేసిపో. ఎల్లప్పుడూ నావాకిలి నీ రాకకోసమే తెరచి వుంచుతాను. ఎప్పుడూ నేను నిన్ను ఆదరించగలను. నా కెలాటి జంజాటమూ లేదు. అన్నయ్య దగ్గరనుంచి వెళ్ళి

పోదాము అన్న తలపు కలిగితే చాలు, ఇక్కడికి వచ్చే సెయ్. వస్తావుకదూ"

నాకళ్ళల్లో నీళ్ళు తిరిగినయ్. ప్రపంచం ఎంత చిత్రమైనది? ఎంతటి ఉత్తమహృదయులుంటారు ?

ఆమె నా కేవరు ?

కేవలం ఒక స్నేహితురాలు.

ఆమెకు నామీద ఎందుకింత దయ ? ఏందుకింత ఆదరం ?

ఆమే చెప్పింది. అందుకనేనా !

కష్టాలలో వున్న మనుష్యులనుచూస్తే ఎంతటి గట్టి గుండె కలవారికైనా ఆర్ద్రత కలుగుతుంది. అని ఆమె ఇంతకుముందే నాకు బోధపరిచింది. ఆమె చేతులు పట్టుకుని "ఆజన్మాంతమూ కృతజ్ఞురాలనై వుండగలననీ, యీ మేలు ఎప్పటికీ మరచిపోలేననీ" చెప్పాను.

ఆమె చలించింది.

"ఇందులో ఏముంది. ఉత్తరాలు వ్రాస్తుంటావు కదూ" అన్నది.

అన్నయ్య ముఖంలో దుఃఖ చిహ్నలేమీ లేవు. అలా అని సంతోష చిహ్నలుకూడా కన్పించలేదు. ఒకరకంగా హృదయం బండబారిపోయింది. వైరాగ్యంలాంటిదేదో పట్టుకుని వుంటుంది. అయితే తనతో తీసుకెళ్ళటానికి నన్ను ఒప్పించటంలో కొంత సంతృప్తి మాత్రం కల్గింది. అన్నయ్యతో వచ్చేశాను. చాలానాళ్ళు గుంటూర్లోనే వున్నాము. తరువాత ఒకమోస్తరు పెద్ద వూళ్ళుతిరిగాము.

స్టేషనుమాష్టరు అయిన తర్వాత ఇలాటి చిన్న చిన్న స్టేషన్‌లకి మారుతున్నాము. ఈ పూర్రొచ్చికూడా పడెనిమి దేళ్ళ పైగానే అయింది.

విశాఖపట్నంలోని స్నేహితురాలు చాలారోజుల వరకు ఉత్తరాలు వ్రాసింది. చిట్టికి ఐదోయేడు వచ్చేవరకూ ఆమెనుంచి ఉత్తరాలు వస్తూనే వున్నాయి. తర్వాత, తర్వాత ఆమెనుంచి ఉత్తరాలు ఆగిపోయినయ్. గుంటూర్లో వుండగానే ఒకరోజున అన్నయ్య చెప్పాడు ఆమె పెండ్లి చేసుకుందని. నా కాశ్చర్యమైంది. "నీకెలా తెలిసింది" అని అడిగాను.

"పేపర్లోపడ్డది" అని చూపించాడు. తర్వాత చాలరోజులకు అమె ఉత్తరం వ్రాసింది. తను ఇంకా ఉద్యోగం చేస్తూనే వున్నానన్నదే అందులోని ముఖ్యమైనసారాంశం.

నేను కూడా ఉత్తరం వ్రాశాను. అందుకు శుభాకాంక్షలతోపాటు ఆమె భవిష్యజ్జీవితం సుఖదాయకంగా వర్ధిల్లాలని భగవంతుణ్ణి, ప్రార్థిస్తూ వ్రాశాను. దానికి ఎన్నాళ్ళకో ఒక సమాధాన వాక్యం వ్రాసింది.

నాకు ఆశ్చర్యమైంది.

చాలా బాధనిపించింది.

ఆమె వ్రాసింది. "మనదేశంలో వివాహాలు ఏ కొద్ది మందికో తప్ప శుభకరంగానూ, సుఖకరంగానూ పరిణమించవు" అని. ఇలాటి అభిప్రాయంతో నేను ఏకీ భవించలేను! అని స్పష్టంగా వ్రాశాను. దానికామె వివరంగా వ్రాస్తూ "చాలామందికి తమకు ఏమి కావాలోకూడా

తెలీదు. కేవలం వర్తమానంలోనే జీవిస్తుంటారు. అలాటి వాళ్ళే ముఖ్యంగాఎక్కువ మందిస్త్రీలు మన దేశంలో మృణ్మయమైన మేధస్సూ, అజ్ఞానమూకూడా ఒక రకమైన వరాల వంటివి. ప్రత్యేకమైన వ్యక్తిత్వమూ, ప్రత్యేకమైన అభిరుచులూవున్న స్త్రీ, బాధపడక తప్పదు. కేవలం ఏమీ చదువుకోక, భర్తేదైవమనీ, సంతానమే పరమపదమనీ, భావించేవాళ్లే మనకంటే ఎక్కువ సుఖపడుతున్నారు. అంటే వాళ్ళకు మనకున్నన్ని సమస్యలుత్పన్నంకావు. అసలు సమస్యలంటే వాళ్ళకేం తెలుసుగనక - అందుకని అనాదినుంచి సృష్టికార్యానికి తోడ్పడుతూ ఆలోచించటానికి కూడా వ్యవధానంలేక సుఖంగానే వుంటున్నాము అని అనుకుంటూ చాలా యెక్కువమంది మన దేశంలో జీవిస్తున్నారు. వాళ్ళ గురించి నాకేమీ విచారంలేదు. వాళ్ళగురించికాక నాబోటి వాళ్ళను గురించి ఆలోచించు" అని వ్రాసింది.

ఈ ఉత్తరానికి నాటికీ నేటికీకూడా సమాధానం వ్రాయలేదు. మళ్లీ ఆమెనుంచి నాకూ్కడా ఉత్తరం అందలేదు.

అన్నయ్య పూర్తిగా మారిపోయినాడు.

చిట్టి ఇరవైనాల్గంటలూ అన్నయ్య కోసమే ఎదురు చూస్తుంటుంది. అతిగారాబంగా.

కాసేపు బజారు పోవటానికి వీల్లేదు. కొద్దిగా ఆలస్యంగా ఇంటికి రావటానికీ వీలులేదు.

ఉయ్యాలలో వూగేరోజుల్లోకూడా అన్నయ్యగొంతు వినపడగానే లేచి కూర్చునేది.

మొండికేసి అల్లరిచేసి నిద్రపోనినాడు గంటల తరబడి అలానే ఎత్తుకుని నిలుచుండేవాడు. రాత్రిళ్ళుకూడా విసుక్కునేవాడుకాదు. నాకంటేకూడా అన్నయ్య దగ్గరే చిట్టి ఎప్పుడూ వుండాలని కోరుకుంటుంది.

చిట్టికోసరమే మేమిద్దరమూ బ్రతుకుతున్నాము. చిట్టి లేకపోతే మా బ్రతుకులెంత నిస్సారంగా వుండి వుండేవో అని పిస్తుంది.

ఆతలపుకలిగితేనే వణికిపోయేదాన్ని. అయితే అప్పటికీ నేను గతాన్నంతా పూర్తిగా మర్చిపోలేకపొయ్యాను. వెనుక వెనుక నీడవలె గతస్మృతులు వెన్నంటి బాధిస్తుండేవి. ఒంటరిగా కూచుంటే వివశమైపోయేఆలోచనలతో వేగిపోయేదాన్ని. మబ్బు మబ్బుగావున్న రోజుల్లోనూ, ఆదివారాలూ, చల్లటి వెన్నెలరోజుల్లోనూ ఎంత కన్నీరు కార్చేదాన్నో-- ఆకాశంమీద వర్షంవచ్చేసూచన కనపడగానే ఆయన తలపునకు వచ్చేవారు. మబ్బుమబ్బుగా వున్నరోజుల్లో ఆయన ఎక్కడకూ కదిలేవారుకారు. ఆ వాతావరణమంటే ఆయనకు చాలా ఇష్టం. ముఖ్యంగా సాయం సమయాల్లోనైతే, వాన కురిసి వెలిస్తే, చంద్రకాంత పువ్వులుకోసుకు రావటమూ పాదులన్నీ త్రవ్విపొయ్యటమూ ఆయనకు చాలా ఇష్టం. కిటికీలోంచి వానకురిసి వెలిసిన తర్వాత పడమటివేపు రంగు రంగుల మబ్బులీన్ని, తుడిచివేచిన అద్దంలా వెలిగే సూర్యుణ్ణి చూడటం ఆయనకు చాలా యిష్టం. అలాటిరోజుల్లో ఎంత కన్నీరు కార్చేదాన్నో చెప్పలేను.

కన్నీను అలా ప్రవహిస్తూనే వుండేది. అంతంటూ

లేకుండా ఇప్పటివరకు యీ జీవితంలో ఎంత కన్నీళ్ల కార్చానో ? అయితే అన్నయ్యకి తెలీకూడదన్న వుద్దేశంతో ఎప్పుడూ అతడిముందు బయటపడలేదు. కానిఒకటి రెండుసార్లు అన్నయ్య చూశాడు ముఖమంతా నల్లగాచేసుకుని తిరిగాడు ఆ రోజల్లా. అన్నయ్య నన్నెలా ఓదార్చగలడు! ఒకరి కొకరం ఓదార్పు. అంతేకాని ఏమని వూరడించగలడు?

అందుకని ఇంట్లో వీలయినంతకాలం గడుపుతుండేవాడు. ఏ క్షణం తీరికవున్న ఇంట్లోనే వుండేవాడు. అలాటిది జీవితంలో క్రమక్రమంగా కొత్తకొత్త వాతావరణానికి అలవాటుపడి పోజొచ్చాను. పండుగలు అవీ మొదలు మొదలు మాకు తెలీనట్లే గడచిపోయేవి. పొద్దుగుంకటం, పొద్దు పొడవటం మాత్రమే తెలుస్తుండేది మొదట్లో. మొదట్లో, చిన్నగా చిట్టికోసం పండుగలుకూడా మాయింటికి రావటం నేర్చుకున్నాయి. చిట్టి కూచున్నరోజునపండుగ. చిట్టి అడుగేసిన రోజున పండుగ. ఒక్కమాట మాట్లాడిన రోజున పండుగ. చిట్టి ఆటలూ - పాటలూ చూసి వెనుకటి జీవితం అంతా కొంతలో కొంత మరచిపోయి మనగలగటం నేర్చుకున్నాను.

కాని ఒక్కొక్కరోజు నా హృదయం కలకబారిపోయేది. రాత్రిళ్ళు సరిగా నిద్రపట్టేదికాదు. పగలంతా ఒంటరితనం భరించలేక బలవంతాన నిద్రపోవటం అలవాటు చేసుకున్నాను అందువలన చిట్టి నిద్రపోతుండేది. రాత్రిళ్ళు నిద్రపట్టేది కాదు.

అన్నయ్య పగలంతా పనిచేసివచ్చి అలసీ అలసీ మంచి నిద్రలో వుండేవాడు. బిక్కు బిక్కుమంటూ కళ్ళుచించుకుని చీకట్లోకి చూస్తూ గంటలు గంటలు గడిపేదాన్ని, పురాస్మృతులు కళ్ళముందు అప్పుడు జరుగుతున్నట్లుగా అవపడి బాధపడేదాన్ని. చీకటీ! నీరసమైన నిశ్శబ్దం.

గడియారపు ధ్వనికూడా స్పష్టంగా వినపడుతుండేది. అన్నయ్య గురకపెట్టి నిద్రపోయేవాడు. మధ్య మధ్య ఏవో కలవరిస్తుండేవాడు. "రైట్ టైమ్ . . . లేట్ . . . టెన్ ఫిఫ్టీన్-టెన్ ట్వంటీఫైవ్ . . . హల్లో. . . ." అని కలవరిస్తుండేవాడు. మొదలు భయమయ్యేది. చెప్ప రాని దిగులయ్యేది, ఏమిటి జీవితాలు? ఎలా జీవిస్తున్నాము?

అన్నయ్య అదేమాదిరి, రోజూ కలవరించేవాడు. అప్పటికీ ఇప్పటికీ కలవరిస్తూనే వున్నాడు. ఈ రకపు జీవితం అలవాటైపోయింది. ఎండా-వానా, గాలీ- వెల్తురూ, వెన్నెలా, చీకటీ, చలీ, మొదలైనవి ఎక్కడో పడివున్న బండరాళ్ళను బాధించలేనట్లే ఇక మమ్మల్నికూడా ఏవీ అంటలేవు. మేము నిర్లిప్తులము. మాకు కోరికలులేవు. సాధనా లేదు. సాఫల్యమూలేదు. చిట్టి చిన్నతనంనుంచి చాలా చురుకుగా పెరిగింది. అంత గారాబం చూపెట్టినా చిట్టిలోని చురుకుతనం కానీ, తెలివితేటలుకానీ, ఏమీ తగ్గిపోలేదు. అదే విశేషం. పెరుగుతున్న కొద్దీ చిట్టిని పరిశీలించి చూస్తుంటే వాళ్ళ నాన్నగారి ప్రకృతే దాని ప్రకృతికూడా అనిపించేది నాకు. చిన్నతనంలోనే వానకురిసేముందు నల్లటి మబ్బుల్ని దీక్షగా పరికించేది. వర్షఋతువులో ఆర్ద్రిపురు

గుల్ని పట్టుకుని తెచ్చి చూపించేది. భావి గిలకమీద రంగు రంగుల పాలపిట్ట అరచినా నిద్రపోతున్న నన్ను లేపి, తీసుక పోయి చూపించేది. క్రమ-క్రమంగా నాదుఃఖంకరగిపోయింది.

ప్రొద్దున్నే సింగు ఆదరా బాదరా పరిగెత్తు కొచ్చాడు. అప్పటికి దయాసాగరం మంచం దిగలేదు. నిద్రనుంచి మాత్రం మేల్కొన్నాడు. కంఠందాకా దుప్పటి కప్పుకుని కిటికీలోంచి బయటకు చూస్తున్నాడు. ఎండ అప్పుడే యెందుకో తీక్షణంగా వుంది. పచ్చటి వేపచెట్లు దూరంగా అతడికి కనబడుతున్నాయి. మధ్యమధ్య చల్లనిగాలి శరీరానికి తగిలి గిలిగింతలు పెడుతోంది. కాకులు కావుకావుమని యెక్కడో గోలచేస్తున్నాయి. యెండ పచ్చటి నాలిక సాచి యెదుగుతున్నది. అటువంటి వాతావరణంలో దయాసాగ రానికి లేవటానికి బుద్ధిపుట్టలేదు ఎంతసేపు అలానే పక్క మీదవున్న ఇంకాసేపు, ఇంకాసేపు అనిపిస్తున్నది మన స్సుకి, ఏమి టేమిటో ఆలోచనలు పోతున్నాయతడికి.

ఆ సమయంలో సింగువచ్చాడు.

దయాసాగరానికి ఆశ్చర్యమైంది. ఏమిటో సంతోష మైందికూడా.

"బాబూ" అన్నాడు సింగు.

దయాసాగరం లేచి కూచున్నాడు.

సింగు చెప్పాడు. అక్క డెక్కడో గూడ్సుబండి పడి పోయిందట. అందుకని రైళ్ళు యెప్పుడు వస్తవో కూడ తెలీదు. ఐదారు గంటలు ఇంకా ఎక్కువ ఆలశ్యం కావ చ్చును. స్టేషరుమాష్టరుగారు దయాసాగరాన్ని పిలుచుక

రమ్మన్నారట. దయాసాగరం వెంటనే లేచాడు.

ముఖం కడుక్కుందామని దొడ్లోకి వెళ్ళగానే దొడ్లో వేపచెట్టుకింద లేత యెండలో ఓ కాకిపిల్ల చచ్చిపడివుంది. గోడవారగా ఓపదికాకులు చేరిన వప్పుడే!

స్టౌవ్ వెలిగించి నీళ్ళుపడేశాడు దయాసాగరం. ఆ కాకిపిల్లను బయట పడేయమని చెప్పాడు సింగుకు. పదినిమిషాల్లో సాగరం ముఖం కడుక్కున్నాడు. సింగు యీాలోపల కాకిపిల్లను చాలాదూరంగా వేసివచ్చాడు. కాఫీ తయారయింది. సింగువెంబడి యాసాదగరం బయులు దేరాడు. స్టేషన్ మాష్టరు గారింటికి వచ్చేసరికి ఆయన బయటకుర్చీలో కూర్చుని వున్నాడు. ఆయన ముఖమంతా ఎందుకో పాలిపోయింది. పడిలేచినవాడిలా వుంది ఆయనవాలకం.

దయాసాగరం అడిగాడు. "మీా ఒంట్లో బావుండ లేదా" అని. ఆయన నీరసంగా నవ్వాడు

"మరేంలేదు. ఏమిటో నీరసంగావుంటున్నది. మనసు కంతా ఆందోళన. ఏమిటో చెప్పలేను. రాత్రికాస్త టెంపరేచర్ కూడా వచ్చింది." అన్నాడాయిన. దయాసాగరానికి ఏమి మాట్లాడటానికి తోచలేదు. సింగు స్టేషన్‌కు వెళ్ళిపోయాడు అప్పుడే.

"పోనీ ఊళ్లో కాస్త ఎవరైనా వైద్యుడున్నాడేమో చూసి వైద్యుణ్ణి పిలిపించకూడదా" అన్నాడు దయాసాగరం.

ఆయన తల అడ్డంగా తిప్పాడు.

"లాభంలేదు. వీళ్ళు ఇంజక్షన్ యివ్వడానికి తలపడ్డారంటే అట్లకాడపెట్టి పొడిచినట్లే వుంటుంది. అయినా యింక

నా శరీరానికి మందులు పనిచెయ్యవు. ఎక్కడైనా తపస్సు చేసుకోవటానికి పోవాలనుంది. తపస్సంటే ముక్కు మూసుకుని జపం చెయ్యటంకాదు నాదృష్టిలో. ఏమిటో యీమమకారాలకీ, ప్రలోభాలకీ అతీతంగా బ్రతకటమే తపస్సు."

దయాసాగరానికి ఆ రకంగా మాట్లాడేవాళ్ళను చూస్తే జాలేస్తుంది. ఏం మనుషులు. ఎంత బలహీనులు? అనుకుంటాడు.

లోపలనుంచి కమలవచ్చింది.

ఏదో మందిచ్చింది. ఆయన ఏమీ మాట్లాడకుండా ఆ మందు పుచ్చుకున్నాడు.

"నువ్వెళ్ళి చూడు. కాస్త ఆ థర్టీన్ అప్ ఎప్పుడు వస్తుందో ఏమిటో! నేను పదిదాటాక వస్తాను సాగరం. సింగుని పంపించు. పోస్టాఫీసుకు పోయివస్తాడు."

దయాసాగరం సరేనని లేచి వెళ్ళాడు.

స్టేషన్ చేరుకునేసరికి యెనిమిదైంది.

సింగునుపంపి సాగరం ఫోనుతీసుకుని కనుక్కున్నాడు. అక్కడెక్కడో మార్కాపురం స్టేషనుకు ముందు గూడ్సు పడిపోయింది. క్రేన్ రావాలి. అప్పుడుగాని రాకపోకలు మళ్ళీ సౌకర్యంగా జరుగవు.

సాగరానికి విశేషించి పనిలేదు. తెల్లవారుజామున వచ్చేబండి రాలేదు. ఇంకో గంటకో రెండు గంటలకో రావచ్చు. లేకపోతే ఇంకా ఆలస్యం కావచ్చు.

అవాళ పక్కస్టేషనుగల వూళ్ళో ఏదో తిరణాల. అందుకని పక్కనున్న రెండు మూడు పల్లెటూళ్ళ నుంచి

— మనుషులూ - మమతలూ

చాలామంది జనం వచ్చారు స్టేషనుకి ఆ వూరుపోదామని.

స్టేషనంతా సత్రంలా వుంది.

ఓ పక్కన అన్నాలు తింటున్నారు కొంతమంది. స్టేషన్ బయట చెట్లకింద విశ్రమించారు కొందరు.

నలుగురు నలుగురు చేరి పులిజూదమో దాడాటో ఆడుతూ అట్టహాసంగా అరుచుకుంటున్నారు.

క్షణ క్షణానికీ ఎవరో ఒకడొచ్చి దయాసాగరాన్ని అడిగి పోతున్నారు. బండి యెంత లేటు ? యెప్పుడొస్తుంది ? అని. దయాసాగరానికి చెప్పలేక ప్రాణం విసికిపోతున్నది. పై గాగోలగోల. ఆతిరణాలు సామాన్యమైందికాదు. అక్కడ ప్రజలు ఆ తిరణాలలో యెనలేని వుత్సాహంతో పాల్గొంటారు. చుట్టుపక్కల పదహారూళ్ళ ప్రజలకూ అమితమైన వుత్సాహం ఆ తిరణాలంటే.

చిన్నాపెద్దా కలసిస్టేషన్లోనూ, బయట చెట్లక్రిందనూ ఆక్రమించుకున్నారు.

సాగరానికి విసుగ్గావుంది.

అక్కడ చాలమంది పూర్వ మెప్పుడో ఆ వూళ్ళో రైలు పడిపోయిన సంగతి గురించీ ఎంతమంది జనం చనిపోయిందీ, ఎంతెంత నష్టంజగిందీ చర్చించుకుంటున్నారు.

ఇంతలోకే యెవడో యెత్తుకున్నాడు. ఆ ప్రమాదం తాలోకు వివరాలను యెవరో పాటగా వ్రాశారట. అతడా పాటే పాడుతున్నాడు. పదిమందీ అతనిచుట్టూ మూగారు.

దయాసాగరానికి విసుగు పుట్టింది.

ఇంతలో ఫోన్ మోగింది.

దయాసాగరం వెళ్ళాడు ఫోన్ దగ్గరికి.

తెల్లవారుజామున వచ్చేబండి నరసరావుపేట చేరిందట. కాబట్టి ఇంకా రెండు గంటల్లో రావచ్చును. దయాసాగరం బుంకింగు విండోలోంచి చూశాడు.

ఆగుంపుతో సింగుకూడా కలిశాడు. తన్మయత్వంతో వింటున్నాడు. దయాసాగరానికి నవ్వువచ్చింది. అసహ్యం కూడా కలిగింది ప్రజలమీద. కాసేపుండి సింగువచ్చాడు. స్టేషన్ మాష్టారుకి ఉత్తరాలేమీ రాలేదుట. ఆ ఉత్తరాలు రాత్రి బండి తాలూకు వచ్చినవి.

ప్రొద్దుట బండిలో కొత్తటపా వస్తుంది.

దయాసాగరానికి ఒక ఉత్తరం వచ్చింది. తల్లి వ్రాసింది.

కొత్త విశేషాలేం లేవుకాని, తన అత్తవారింటి విశేషాలు కొన్ని వ్యంగంగా స్ఫురించినాయతడికి.

వాచ్చిన వాళ్ళందరికి, అడుగుతున్న వాళ్ళందరికీ, సింగు విసుగులేకుండా చెబుతున్నాడు. ఎంతలేటో! ఎందుకు లేటో!

సింగుకికూడా మనసులో తిరణాలకు వెళ్ళి చూసి రావాలని వుంది. కాని వీలవ్వేలా లేదు.

సింగు చెప్పాడు. ఇవాళ మీకు ఆరింటికీ భోజనం పంపిస్తారట. రైలు బాగా ఆలస్యంగా వస్తుందేమో! మీరు ఇంటికిపోయి వంట చేసుకోవటం కష్టంకదూ, అందుకని"

దయాసాగరానికి బెంగతీరిపోయింది.

"ఎందుకు వద్దని చెప్పకపోయినావా?" అన్నాడు

ఆయన. దానికి సింగేమీ మాట్లాడలేదు.

"ఉత్తరం యెక్కడనుంచి బాబూ" అని అడిగాడు సింగు. దయాసాగరం చెప్పాడు.

సింగు యెందుకో నవ్వాడు సింగు ఎందుకు నవ్వింది దయాసాగరానికి తెలుసు.

పదిన్నర దాటింది.

సింగు సిగ్నలిచ్చి వచ్చాడు.

స్టేషనంతా కోలాహలంగా వుంది.

దయాసాగరానికి చేతినిండా పనిదొరికింది. ఎన్ని టిక్కెట్లో యిష్యూ చేశాడివాళ.

పదకొండుకు పదినిముషాలు ముందుగా రైలు వచ్చింది. త్రోసుకోవటాలు, నెట్టుకోవటాలూ, పసిపిల్లల యేడుపులు, గాదరబీదరగా వుంది.

దయాసాగరం వచ్చి చూశాడు.

గార్డువచ్చి టైమ్ నోట్ చేసుకుని పోయాడు.

ఈ స్టేషనులో ఎక్కిన వాళ్ళంతా పక్క స్టేషనులో దిగుతామని గోల పెడుతున్నారు. ప్రతిపెట్టుదగ్గరా, తిరణాల జనం, రైలు దొనకొండలో ఆగిపోవాల్సిందే. మళ్ళీ నాలు గయిదుగంటలు నేరుగా వెళ్ళటానికి అస్కారం లేదు. దయాసాగరం పెట్టెలవెంబడే నడుస్తున్నాడు.

ఒకచోట అతడి కెవరో వెనుకనుండి పేరుపెట్టి పిలి నచిట్లయింది. అతడు ఆశ్చర్యపోయినాడు. రెండుపెట్టెల వెన కాలకిటికీలోంచి ఒంగి తననే చెయ్యిపట్టి ఎవరో పిలుస్తు న్నారు. దయాసాగరం పరిశీనగా చూచాడు. అతడికి

సంతోషం కలిగింది. ఇంతలోనే చెప్పలేని సిగ్గు కృంగదీసింది. ముఖం కాస్తంతలోనే చిన్నబోయింది.

అతడు నడచి ఆపెట్టె దగ్గరకు పోయాడు.

అతడు సంతోషంగా పలుకరించాడు.

దయాసాగరానికి హృదయంలో బిక్కు బిక్కుమంటూనే వుంది. సత్యవతికూడా వున్నదేమోనని అతడి అనుమానం కొద్దిక్షణాలలోనే నిజమైంది. ఆమెకూడా వచ్చి చూసింది. దయాసాగరం క్షణకాలం తన కళ్ళను తాను నమ్మలేక పోయాడు. సత్యవతి చాలా మారిపోయింది. ఆమె యిప్పుడు పెళ్ళికానప్పటి బాలికవలె లేదు.

దయాసాగరంవైపు చూసి ఆమె చిరునవ్వునవ్వింది.

"మీరిక్కడ వుంటున్నారా"? అని అడిగింది.

"ఎక్కడికి వెళుతున్నారు?" అని అడిగాడు దయాసాగరం. అతడు చెప్పాడు.

బెజవాడనుండి కర్నూలుకి వెళుతున్నారట. కర్నూలులో యేదో ఉద్యోగమట.

అతడడిగాడు. 'రైలు ఎన్నింటికి చేరుతుంది ద్రోణాచలం స్టేషనుని. తరువాత కనెక్షవుంటుందా' అని. దయాసాగరానికి మనసులో ఒక వూహ జనించింది. క్షణంలో బలపడింది.

ఆతను చూశాడు వాళ్లిద్దరినీ. దంపతులను.

వాళ్ళిద్దరూ తన కిదివరలో బాగా పరిచయం వున్న వాళ్ళే. వాళ్ళ జీవితాలలో గడచిపోయిన కాలంలో తనకూ కొంత ప్రసక్తివుంది.

అయితే అతడు మారిపోయాడు.

ఆంతరంగికంగా కూడా మారిపోయాడని తానెందు కనుకోవాలి. అతడీవరలో తనకు మంచి స్నేహితుడు. దయాసాగరం చాలా చాలా ఆలోచించు కున్నాడు.

“మీరీపూట ఇక్కడ దిగండి. టికెట్లూఅవీ మార్పిం చటం లేక తక్కినవిషయాలూ అన్నీ నేను చూచుకుంటాను. సాయంకాలం రైల్లో వెళ్ళవచ్చును. అయితే కన్వీని యంట్ గా కూడా వుంటుంది” అన్నాడు.

అతను తన స్నేహితుడు యేమీ మారలేదనిపించింది దయాసాగరానికి. అతడు ఆరోజుల్లో ఎలా నవ్వేవాడో ఇవాళకూడా అలానే నవ్వాడు.

“నాకేం అభ్యంతరంలేదు. మరి...’ అని పూర్తి చెయ్యలేదు. సత్యవతి కేసి చూశాడు దయాసాగరం. ఆమె సిగ్గుపడింది. ఆమెకెంతో దిగులుగా వుంది పాపాయినిగురించి. సరిగా పిల్లవాడికి ఐదోనెల. మధ్యాహ్నం యీపాడు రైల్లో యెలా ప్రయాణం చెయ్యాలా అని తపనపడుతోంది పాపం అన్నట్లు చూసింది. దయాసాగరంకాస్త బలవంతంచేశాడు. “మళ్లీమళ్లీ మనం కలుసుకోలేం. ఈఒక్కపూటకుమాఇంట్లో వుండతగరా” అన్నాడు.

సత్యవతి ఒప్పుకుంది పిల్లవాడికోసం.

అతడు నవ్వాడు. నవ్వి అన్నాడుకదా —

“ఉండు నీమీద ఓ కథ వ్రాస్తాను” అన్నాడు దయాసాగరంతో.

దయాసాగరం నవ్వి “ఇప్పటికి .రాయనట్టేనా”

అన్నాడు సత్యవతివేపు చూసి.

వాళ్ళు కంపార్టుమెంటులోంచి దిగుతుంటే సాగరం నిజంగా ఆశ్చర్యపోయినాడు సత్యవతి చేతుల్లో పొత్తిగుడ్డల్లో పసిపిల్లాణ్ణిచూసి. అతని మనసు కేమిటో అనిపించింది.

సింగుని పిలిచాడు.

వాళ్ళకు యెక్కువ సామానుకూడా లేదు.

రెండు పెట్టెలూ, ఒక తీగెవుయ్యాల, మరేవో చిన్న చిన్న సామాన్లూ, ఓ గోతంలో వున్నాయి. సింగు వాటి నన్నిటినీ కంపార్ట్మెంటులోంచి దింపాడు.

ఎవరో బండ్లు కట్టుకుని వచ్చారు. అప్పుడే రైల్లో యెగబడ్డారు. రైలు కదిలిపోయింది.

దయాసాగరం సత్యవతినీ ఆ అమ్మాయి మొగుడైన తన స్నేహితుణ్ణి వెంటబెట్టుకుని తన ఇల్లుచేరుకుని జీవితం ఎంత విచిత్రమైందీ అనుకున్నాడు.

పెట్టెలు మాత్రము తీసుకున్నాడు సింగు. తక్కిన సామానంతా బుకింగు రూములోనే వుంచారు.

సత్యవతి ఇంట్లోకి రాగానే గంపెడాశ్చర్య పడ్డది.

ఇంట్లో ఎవరూ ఆడదిక్కు లేనందుకు. ఆమె అలా వూహించలేదు. సాగరం భార్య వుంటుందనుకుంది అందు కనే అంత నిస్సంశయంగా ఒప్పుకో కలిగింది.

అదీగాక ఇంకో కారణంకూడా లేకపోలేదు. ఆమెస్త్రీ సాగరం పెళ్లాన్ని చూడాలని ఆమె కనిపించింది. ఆ అని పించడంలో వింత యేమీలేదు. సాగరం తన పూర్వపరిచి తుడు. అదీ ఆమె మనసులో వుంది.

"మీ ఆవిడకనపడదేం" తెలివి తక్కువగా అడిగింది.

"ఇక్కడ లేదు" అన్నాడు దయాసాగరం.

"ఇంకా రాలేదా?"

"తీసుకరాలేదు" అని సమాధానం చెప్పాడు.

"అయితే చెయ్యి కాల్చుకుంటున్నా నన్నమాట" అనినవ్వింది ఆమె. దయాసాగరంకూడా నవ్వాడు. సత్యవతికి ఒక రకం ఆశాభంగం పొందినట్లయింది.

"సరే మరినాకు సంబారాలు చూపితే తర్వాత ప్రయత్నంగా-విస్తాను" అన్నది. దయాసాగరం యీ విషయం ఆలోచించ లేదు. అతను సిగ్గు పడ్డాడు.

ఆమెకు కావలనవన్నీ చూపించాడు ఎక్కడెక్కడ వున్నవీ. వంట ఇంట్లో ఓ మూలగా ఇటుకరాళ్ళ పొయ్యి వుంది. దాని మీద దయాసాగరం యెప్పుడేనా నీళ్ళుకాగ బెట్టుకు నేవాడు.

ఆమె స్నానంచేసి వంట ప్రయత్నంలో వుండగా దయాసాగరం స్టేషన్ మాష్టారింటికి వెళ్ళి వస్తానని బయలు దేరాడు.

సత్యవతిపోయి ముందు కూచున్నదేకాని ఆమె ధ్యాసంతా యెక్కడో వుంది. తాను ఎలా ఒప్పుకుంది. తమ కష్టం తాము పడేవాళ్ళు ఎలానో రైల్లోనే. దయాసాగరం ఆహ్వానించగానే మరి ఎందుకువచ్చినట్లు ఆమెను ఆమె ప్రశ్నించుకుంది. అతడిసంసారాన్ని చూసిపోదామనే. అయితే ఆమె ఆశించినట్లుగా అతడి భార్య ఇక్కడలేదు.

పిల్లవాడు క్యాంప్ కాట్ మీద నిద్రపోతున్నాడు.

ఇంతలో సింగువచ్చాడు. ఒక చెంబుతో పాలుతీసు కుని. సత్యవతి వచ్చి అడిగింది. ఎవరు చెప్పారని. సింగు నవ్వాడు.

"ఎవరు చెప్పాలమ్మా, నాకు తెలీదా"

దయాసాగరం భార్యను గురించి అతడి నేమైనా అడిగి తెలుసుకుందామనుకుంది. మళ్లీ ఆమె సభ్యతకు కట్టు బడి పోయింది. "అమ్మగారు ఎన్నాళ్ళయింది పుట్టింటికి పోయి?" అని మాత్రమే అడిగింది.

ఇక లెక్కలు కట్టవచ్చునన్నది. ఆమె వుద్దేశ్యం.

కాని సింగునవ్వి అన్నాడు. ఆమె రెండో ప్రశ్న ఆలోచించుకునేలో వునే.

"అసలు అమ్మగారు యీవూరు రానే లేదమ్మా"

సత్యవతి ఆశ్చర్యపడింది.

ఎందుకో? అనుకుంది. తనలో తాను అనుకున్నట్లుగా పైకి అనేసింది.

సింగు ఏం మాట్లాడలేదు.

"స్టేషనుమాష్టారికి ఒంట్లో ఏమీ బావుండలేదు. నేను వెళుతున్నాను స్టేషనుకి." అనిచెప్పి వెళ్ళిపోయాడుసింగు.

ఆమె యేదో పనిమీద అటూయిటూ తిరుగుతుంటే టేబిలుమీద సాగరం పెళ్ళిఫొటో కన్పించింది.

ఆమె ఎంతో ఔత్సుక్యంతో చూసింది. చూడనట్లు గానే అనుకుని ఇంట్లోకి వెళ్ళిపోయింది.

ఆమె మనసుకుమాత్రం "ఫరవాలేదు. పిల్ల బాగానే వుంది." అనిపించింది.

దయాసాగరం సత్యనారాయణగారింటికి వెళ్లేసరికి ఆయనలేడు, లోపలనుంచి కమల వచ్చింది.

భోజనం విషయం పంపించనవసరంలేదు అని చెప్ప టానికి దయాసాగరం సిగ్గుపడ్డాడు. ఏవిధంగా చెప్పాలో అతడికి తోచలేదు. చివరకు చెప్పేశాడు–చుట్టాలొచ్చారని.

ఆమె మరేం మాట్లాడలేదు.

దయాసాగరం స్టేషనుకి వెళ్ళాడు అక్కడినుంచి.

స్టేషన్లో అతడికో విచిత్రం కన్పించింది.

తన మిత్రుడు సత్యనారాయణ గారితో లోకాభి రామాయణం ముచ్చటిస్తున్నాడు.

దయాసాగరం అడిగాడు. "మీావంట్లో కులాసా వుందా" సత్యనారాయణగారు లేదని చెప్పారు.

"మీారు ఎందుకు వచ్చారుమరి ?" అని అడిగాడు సాగరం.

"మీా యింటికేమో చుట్టాలొచ్చిరి. ఇవాళల్లానిను స్టేషనులో వుండమంటే ఏం బావుంటుంది. పైన వీళ్ళు సాయంకాలం వెళ్ళిపోతామంటున్నారు"

తన స్నేహితుడు నవ్వాడు. "నువ్విక్కడ కెందు కొచ్చావు? స్నానమైందా ?" అని ప్రశ్నించాడు సాగరం అతణ్ణి.

"అహా.. మరి ఏమీా తోచలేదు. ఇలా వచ్చేశాను" అని చెప్పాడు సాగరంతో.

'వెళదామా?' అన్నాడు సాగరం.

సత్యనారాయణగారు "కాసేపు కూచోనీ సాగరం. నువ్వెళ్ళు మరి. కాకపోతే ఆవిడ కొత్తచోట తికమక పడుతున్నదేమో"

"సింగు యేడీ?"

"పాలు పోయించుకుని మీా ఇంట్లో ఇచ్చి వస్తానని వెళ్ళాడు. వస్తాడు—" అన్నాడు సత్యనారాయణ.

సాగరం ఇంటికేసి బయలుదేరాడు. క్యాంప్ కాట్ మీాద పడుకున్న పసిపిల్లాణ్ణివంగిచూడ బుద్ధయిందిసాగరానికి.

టేబిలు ముందు కుర్చీ బయట గదిలో వేసుకునికూచున్నాడు.

ఆరుగు పక్కనే కాంపుకాట్ మీాదకు వంగిచూశాడు. పసిపిల్లాడు అమాయకంగా నిద్రపోతున్నాడు.

అతడి పోలికలు చూడామనిచాలా ప్రయత్నించాడు.

గుమ్మంలో సన్నగా నవ్వు వినిపించింది.

సత్యవతి నవ్వుతున్నది. దయాసాగరం ఆమెవేపు చూశాడు. ఆమె కళ్ళలో గర్వం, తృప్తి.

"ఏమిటి చూస్తున్నారు? ఎవరి పోలిక చెప్పండి" అంది సత్యవతి.

దయాసాగరం నవ్వి అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

పది నిమిషాల్లో ఆమె వచ్చింది.

"ఇంట్లో ఆముదం, సున్నిపిండిలాంటి వేమైనా వున్నాయా ?" అని అడిగింది నవ్వుతూ.

దయాసాగరానికి నవ్వు వచ్చింది.

"లేవు మరి. సింగుని పిలిపించి తెప్పిస్తాను".

"ఫరవాలేదు లేకపోయినా. పెట్టెలో వున్నాయి. తాళపు చేతులు ఆయన దగ్గరున్నట్లున్నాయి" అన్నది సత్యవతి. "ఆ అవసరం ఇంకా కలుగలేదు" అనుకున్నాడు లోపలనే. పైకి అనేద్దామని అతడి వుబలాటం.

ఆమాట అనుకోగానే అతడి ముఖమంతా చిరునవ్వుతో వెలిగిపోయింది.

సత్యవతి అడిగింది సూటిగా.

"మీా ఆవిడను ఎందుకు తెచ్చుకోలేదు"?

దయాసాగరానికి నవ్వువచ్చింది. "అదే చూస్తున్నాను" అన్నాడు ఏమీా అనలేక.

పిల్లవాడికి నీళ్ళు పోయటానికి సత్యవతి వెళ్ళిపోయింది. పిల్లవాడికి ఒళ్ళు తుడుస్తూ మళ్ళీ అడిగింది.

"సాంబ్రాణికాని వున్నదా?

దయాసాగరానికి నవ్వువచ్చింది. ఆమెకు వుండవని తెలీదా. ఎందుకిలా అడుగుతోంది. "కాటుకా చాదుచుక్కా కూడా లేవు" అన్నాడు.

సత్యవతి నవ్వింది.

అతడి ముందే మంగళసూత్రంలోంచి చిన్న తాళం చెవి తీసి తనపెట్టె తెరచి కావలసిన సరంజామా అంతా తీసుకుంది.

కొద్దిసేపట్లో సాంబ్రాణిపొగ ఇల్లంతా కమ్ముకుంది, వేరే కొత్తపక్క వేసి పిల్లాణ్ణి పడుకోబెడుతుంటే సాగరం చూశాడు.

సత్యవతి చాలా పెద్దదయి పోయినట్లుగా అనిపించిం

దతనికి. పైన ఇంకోటి అతడికి కనబడుతోంది. సత్యవతి చాలా గర్వంగా వుంది. పసిపిల్లవాణ్ణి చూసుకుని.

వాణ్ణి లాలించేటప్పుడు అలాంటి భావాన్ని ఆమె వ్యక్తం చేయడం అతడు చూశాడు.

"ఇంకా నాపనంతా అయిపోయింది. ఆయనెక్కడ కెళ్ళారోమరి ఇంకా రాలేదేం. అబ్బ:! ఎక్కడ కూచుంటే అక్కడే గంటల తరబడి. ఈవూళ్ళో "యీాయనగారితో రాచ కార్యాలు వెలగబెట్టే వాళ్ళెవరు అని" నవ్వింది.

అరగంటలో అతడు రానే వచ్చాడు.

భోజనాలకు కూచున్నప్పుడు అతడు దయాసాగరాన్ని సత్యనారాయణగారి గురించే ఎన్నో సంగతులు అడిగాడు.

సత్యవతి మానంగా వుంది చాలా సేపు. వాళ్ళు భోజనం చేసి లేచారు.

అతడన్నాడు. "రైల్లో ఏవూళ్ళో వుండే వాళ్ళమో యీాపాటికి. అందుకే పెద్దవాళ్ళంటారు. ఏ పూటకెక్కడ వుంటామో అని. భోజనం చెయ్యగానే దయాసాగరం స్టేషనుకి వెళ్ళాడు. నాలుగ్గంటలప్పుడు ఇంటకివచ్చాడు.

సత్యవతి ఒక్కత్తే కూర్చుని వుంది. అతడు ఆశ్చర్యపోయాడు.

కాఫీ వెచ్చబెట్టి తీసుకుని వచ్చింది సత్యవతి. కాఫీ తాగుతూ అడిగాడు "ఇతడెక్కడికి వెళ్ళాడు" అని సత్యవతి చెప్పింది. 'స్టేషను మాష్టారింటి నుంచి కబురు వచ్చిందట. ఆయన్ను పిలుచుక రమ్మని. ఇంతకు ముందే వెళ్ళాడు."

సత్యవతి అడిగింది. "మా రైలు ఎన్నిగంటలకు వస్తుంది?"

"రేప్రొద్దుటే వెలుదురుగాని లెండి" అన్నాడు దయా సాగరం.

"మా బాగావుంది" అని మాత్రమే అంది సత్యవతి.

ఆవిడ ఏదో ఆలోచించుకున్నట్లుగా గుబుక్కున అడి గేసింది.

"మీ ఆవిడ పేరేమిటి?"

ఆవిడ అడిగిన తీరుచూసి దయాసాగరం నవ్వాడు. అతడికి కొద్దిగా సిగ్గుకూడ కలిగింది. వెంటనే చెప్పలేదు. సత్యవతి నవ్వింది.

"పోనీ సిగ్గయితే చెప్పనవసరంలేదు" అంది.

"నాకేమిటి సిగ్గు. ఆమె పేరు సుగుణ"

"ఆమె అని పగలబడి నవ్వింది సత్యవతి. "ఆమె యేమిటి" అంది.

"ఆమె కాకపోతే ఆవిడ అనుకో ఏమైతేనేం" అన్నాడు.

"మీఆవిడ ఇక్కడే వున్నట్లయితే నేను చూసే దాన్ని కదా" అన్నది సత్యవతి.

"మీ రెప్పుడైనా చూడవచ్చు చూడదలచుకుంటే. మేము దారిలోనే వుంటాముకదా" అన్నాడు దయాసా గరం.

"ఎన్నాళ్ళకో ఏమిటో అసలు మిమ్మల్ని చూస్తానని కూడా నేనెప్పుడూ వూహించలేదు. ఎవరిదారి

వారిది. ఎలా చూసుకుంటామనుకునేది. మీరు పెళ్ళికి కూడా రాలేదుకదూ!"

దయాసాగరం సిగ్గుపడ్డాడు.

అతడికి కష్టంకూడా కలిగింది.

ఒక్కసారిగా వెనుకటి విషయాలన్నీ మళ్ళీ గుర్తు వచ్చాయి. అపుడు ఆరోజుల్లో తానెంత సంకుచితంగా ప్రవర్తించింది గుర్తొచ్చింది. మేష్టారూ, సత్యవతి చెల్లెలూ, అంతా గుర్తుకువచ్చారు. ఆరోజుల్లో సత్యవతి ఎలావుండేదో ఆలోచించుకుంటున్నాడు.

"ఏమిటలా కళ్ళు మూసుకుని ఆలోచనలో పడ్డారు." అన్నది సత్యవతి.

దయాసాగరం తడపడకుండానే అడిగాడు. "ఆరోజుల్లో నువ్వు తేలిగ్గా నన్ను క్షమించ గలిగావా?"

సత్యవతి ఇలాటి ప్రశ్నవస్తుందని వూహించివుండదు. ఆమె దిగ్భ్రమ పొందింది. నిరుత్తరురాలైంది.

"నాకేమీ అర్థం కావటంలేదు. మీరనేది?"అన్నది.

"అప్పుడు నేనంటే అసహ్యం కలిగివుంటుంది నీకు."

"ఎందుకోనాకు తెలియటం లేదు. దయయుంచి మీరిలా మాట్లాడకండి" అన్నదామె.

దయాసాగరం మరేం మాట్లాడలేదు.

సత్యవతి అన్నది. "బహుశా రెండు మూడు నెలల్లో భగవంతుడి కరుణవుంటే చెల్లాయి పెళ్ళిచేయాలని చూస్తున్నారు నాన్నగారు. అప్పుడు నేను మళ్ళీ వస్తాను. అప్పటి

కల్లా మీా ఆవిడ వస్తుందనుకుంటాను."

దయాసాగరం తలవూపి స్టేషన్ కేసి వెళ్లిపోయాడు.

అతడి మనసుకంతా ఏమిటో వెలితిగా వుంది.

ఆరు గంటలప్పుడు అతడు ఇల్లు చేరుకునే సరికి స్నేహితుడు ఇంటికి వచ్చివున్నాడు.

సింగు సాయంకాలం కాగానే స్టేషన్ ఆర్చిమీాద జాజిపూలుకోసుకుని వచ్చాడు.

సత్యవతి మొగ్గలొక్కొక్కటీ తీసి గుచ్చుతున్నది.

దయాసాగరం రాగానే సత్యవతి నవ్వుతూ "ఈ పూటకి వుండి పొమ్మంటున్నారు. పోనీ ఓ నెల రోజు లుందామా ఏమిటి?"

"నిరభ్యంతరంగా" అన్నాడు దయాసాగరం.

"మీా ఆవిడ వస్తే వూరుకోదు. పోనీ రాకపోయినా ఆమెకు తెలిసినా ఇబ్బందే" అన్నది సత్యవతి.

"ఏమో మీా ఆడవాళ్ళ సంగతులు మీాకే తెలుస్తాయి"

అంతసునిశితమైన వ్యంగ్యాన్ని సత్యవతి అర్థంచేసుకోలేదు. స్నేహితుడు అర్థం చేసుకుని నవ్వుకున్నాడు. స్టేషన్ దగ్గర వాళ్ళకు వీడ్కోలు చెపుతుంటే దయాసాగరానికి చిత్రమైన అనుభూతి కలిగింది.

అవాళ వెన్నెలొచ్చింది. రైలు అర్థగంట ఆలస్యంగా వచ్చింది. పంపుపక్క గన్నేరు చెట్టువి రెండుపూలు తుంచుకుని సత్యవతి తలలో పెట్టుకుంది.

రైలు ఎక్కేముందు పసిపిల్లడి లేత చేతుల్ని తాను ఒక చేతితో కలిపి "నమస్తే చెప్పు వెళ్లొస్తామని" అన్నది.

సత్యవతి దయాసాగరాన్ని వుద్దేశిస్తూ.

రైలు వెన్నెట్లో అరుచుకుంటూ వెళ్ళిపోయింది. దయాసాగరానికి పరిగెడుతున్న రైలునిచూస్తుంటే యేమిటేమిటో వూహలు కలిగాయి.

అతడి కవాళంతా పదేపదే సత్యవతీ, పసిపల్లాడూ కళ్ళలో మెదిలారు.

ఇంటికివచ్చి పక్క పరచుకుని ఆకాశం వేపు చూశాడు. వాళ్ళు రైల్లో వెళ్ళిపోతుంటారు. అనుకున్నాడు. లేచి కూచుని కిటికీలోంచి చూశాడు నిద్రపట్టక. దూరంగా తాటి చెట్లూ ఇసుకలోని సన్నటి నీళ్ళజాలూ అస్పష్టంగా కన్పిస్తున్నాయి.

ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటు వాళ్ళలైట్లు వెలుగుతున్నాయి. సింగుని రమ్మని చెప్పాల్సింది అనుకున్నాడు. దయాసాగరం.

చాలా రాత్రివరకూ అతడికి నిద్రపట్టలేదు. గడచిపోయిన జీవితమంతా ఒకసారి గుర్తుకు తెచ్చుకున్నాడు. ముఖ్యమైన సంఘటనలన్నిటినీ ఓసారి నెమరు వేసుకున్నాడు.

చిత్రం.

అతడికారాత్రి ఓ కల వచ్చింది.

సుగుణ తన గుండెలమీద తలపెట్టి నిద్రపోతున్నట్లుగా ఆ కల. తాత్పర్యం, ప్రొద్దున్నే మేలుకున్నప్పుడు అతడి మనస్సు హాయిగావుంది.

# 7

సత్యన్నారాయణగారి ఒంట్లో కులాసా చిక్కలేదు. ఆయన జబ్బు శారీరకమైనది కాదనిన్నీ మానసికమైనదనిన్నీ అందరికీ తెలుసు. ఈమధ్య సత్యనారాయణగారు శుభ్రంగా కూడా వుండటం లేదు. బట్టలు మాసిపోయినా, గడ్డం బాగా పెరిగిపోయినా ఆయన పట్టించుకోనట్లే వుండిపోతున్నాడు.

దయాసాగరం చెప్పాడు. ఒక నెలరోజులు సెలవుపెట్టి గుంటూరు వెళ్ళి మందు తీసుకోమని.

ఆయన నవ్వి "మందులిక పడవు మమకారాన్ని వదుల్చుకుంటే అన్నిరోగాలూ పోతాయి" అన్నాడు.

ఆయన్ను యెప్పుడు కదిలించినా అదే మాట మాట్లాడతాడు. ఆ మాటలకు అర్థం వుండదు.

స్టేషన్లో పనంతా దయాసాగరమే చూసుకుంటున్నాడు. సత్యనారాయణగారు వచ్చి చాలాసేపు కూచుని మళ్ళీ వెళ్ళుతుండేవాడు. సింగు ఆయన్ను కనిపెట్టుకుని వుండేవాడు. దయాసాగరం గడిచిన పదిరోజుల్లోను సుగుణపేర రెండు ఉత్తరాలు వ్రాశాడు. వాటిలో ఒకదానికీ సుగుణనుంచి సమాధానం రాలేదు. అతడికి రాత్రిళ్ళు దిగులుగా తెల్లవారిపోతున్నవి. పగళ్ళు విసుగ్గా పరిసమాప్తములవుతున్నాయి. సత్యవతి మొగుడు తాము క్షేమంగా చేరినట్లు ఒక ఉత్తరం వ్రాశాడు దయాసాగరానికి. అదీ యీమధ్య జరిగిన విశేషం. తల్లి వద్దనుంచి కూడా ఉత్తరం వచ్చింది. ఇంకో నెలరోజులు ఆగితే సుగుణను తీసుకొచ్చి తానుకూడావచ్చి వుంటానన్న

ఆశాభావాన్ని వెలిబుచ్చిందామె అందులో. దయాసాగరా నికి ఏమాత్రం సంతోషమూ కలుగలేదు దాన్ని చూసిన తర్వాత.

పౌర్ణమి వెళ్ళిన రెండవ రోజు. ప్రొద్దుపోయి వెన్నె లొచ్చింది. అప్పుడే కంట్రాక్టరు వచ్చి సెకండ్ క్లాస్ టికెట్ తీసుకున్నాడు. దూరంగా వెళ్ళి తనమే స్త్రీలతో ఏమిటేమిటో మాట్లాడుతున్నాడు. దయాసాగరం కిటికీలోంచి చూశాడు.

దిగంతంలో ఆకాశం క్షితిజాన్ని చుంబిస్తున్నది.

ఇప్పుడిప్పుడే వెన్నెల ఎరుపురంగు వదుల్చుకుని తెల్లగా చిక్కబడుతున్నది. దూరంగా రైల్వేలైను ఇంకా ఇంకా దూరంగా కనబడుతున్నది. సిగ్నల్ స్తంభానికున్న ఎర్ర లైటూ, పచ్చలైటూ ప్రకాశిస్తున్నాయి. దూరంగా ఎక్కడో పొగ కనపడింది. రైలు వస్తున్నదిలా వుంది.

గదిలో దీపం పెద్దదిచేసుకుని దయాసాగరం ఏదో లెక్క సరిచూచుకుంటున్నాడు. ఒకమూల కుర్చీలో సత్యనారా యణగారు కాళ్ళు బారచాచుకుని పండుకున్నారు.

రైలువచ్చింది. గార్డువచ్చి టైమ్‌నోట్ చేసుకుని పోయినాడు. సింగు గణగణమని గంటకొట్టాడు.

చేతిలోని దీపాన్ని చిన్నదిచేసి సింగు పదంపాడుకుంటు నడుస్తున్నాడు. అతడికత్యాశ్చర్యమైంది.

ఒక్కసారి నిలుచుండి పోయినాడు.

అతడామెను ఎప్పుడూ చూసినట్లులేదు... ఆ వూరు కాదు. సింగు బాగా పరిశీలించాడు. బంధువులింటికెవరింటి కైనా వచ్చి మళ్ళీ వూరు వెళ్ళిపోతున్నదేమోననుకున్నాడు

తూర్పు బండికింతముందు రావలసిన పనిలేదు. బహుశా యీ పోయిన బండికి పోవాలేమో యీమె.

"బండి ఇప్పుడే వెళ్ళిపోయింది. ఇంకా ఐదునిముషాలు ముందు వచ్చి వుంటే రైలు అందేది" అన్నాడు సింగు.

ఆమె సమాధానం చెప్పేలోపున్నే "ఏవూరు పోవాలమ్మా, అసలు మీదేవూరు" అన్నాడు.

"నేనే వూరు పోవాల్సిన పనిలేదు. రైలుకోసమూ రాలేదు. ఈ బండ్లోంచి ఇప్పుడే దిగాను"అన్నదామె ఏమిటో దిగులుగా.

"ఎవరింటికి వెళతారమ్మా. మీరొక్కరూ పోలేరా. నేనొచ్చి దిగబెడతాను"

"అవసరం లేదు. స్టేషను మాష్టరు పేరేమిటి"

"ఆయన పేరు సత్యనారాయణగారు. ఆయన వున్నారు. వారి దగ్గరకు తీసుకుపోయేదా ?"

ఆమె వద్దన్నట్లుగా తలూపింది.

"ఇంకా ఇక్కడ యెవరు పనిచేస్తున్నారు"

"ఎవరు కావాలమ్మా మీకు"

ఆమె నిశ్శబ్ధంగా నిలబడింది. సింగే చెప్పాడు.

"దయాసాగరం గారని ఆయనగారూ-యీస్టేషన్లోనే పనిచేస్తున్నారు"

"ఆ, ఆ.... వారే, వారు ఇక్కడ ఇప్పుడు వున్నారా? లేకపోతే వారింటికి తీసుకెళ్ళు" అన్నదామె అత్యుత్సాహంగా. ఆమె ఆ గొంతు కొట్టొచ్చినట్లుగా ఆనందం పొంగింది. వెన్నెల్లో ఆమె ముఖం వికసించడం చూశాడు.

సింగు. ఆమె వాడిపోయిన వదనబింబంపైన మళ్ళీ చిరునవ్వు వెలిగింది.

"మీ కేమవుతారమ్మా వారు...." అని అడిగాడు సింగు. ఆమె పలుకలేదు.

"రండి." అన్నాడు సింగు అడుగు ముందు కేస్తూ, ఆమె ననుసరించి.

హరికేన్ దీపం ముందు కూచుని పని చూసుకుంటు న్నాడు దయాసాగరం. పోర్టన్ వచ్చి వెళ్ళిపోతే ఇంటికి పోవచ్చు. తొమ్మిదో తొమ్మిదిన్నరో అవుతుంది ఇల్లు చేరుకునే సరికి.

దయాసాగరాని కేమిటో ఇవాళంతా విసుగ్గా నేవుంది. ఒక కారణం: ఇప్పుడు వెళ్ళి వంటచేసుకోవాలి. రెండవది. సత్యనారాయణగారు చెయ్యవలసిన పనంతా తన మీద నెట్టి నిశ్చింతగా వుండటం. ఇవాళ అతడికి ఒంట్లోకూడా కులా సగా లేదు.

కిటికీ దగ్గరకొచ్చి నిల్చుని "అయ్యా దయాసాగరం గోరూ! తమకెకోసం మెవరో వచ్చారండీ"అన్నాడు సింగు.

"పోవోయ్. ఇప్పుడు టికెట్లివ్వరని చెప్పు. ఇంకా గంట టైముంది రైలు రావటానికి"

"కాదండీ"

"ఇప్పుడు నాకు తీరికలేదు. మహానుభావా...."

"కాదయ్యా మీకోసమెవరో వచ్చారు"

"ఎవరయ్యా, ఇటు రమ్మను...."

"మీ బంధువులయ్యగారూ...."

దయాసాగరానికి చిత్రమనిపించింది.

పుస్తకం మూసేసి దయాసాగరం లేస్తుంటే సింగు అన్నాడు "ఎవరో ఆడకూతురు."

దయాసాగరానికి ఆశ్చర్యాలలోకల్లా అశ్చర్యంగా వుంది.

గబగబా బయటికి వచ్చేశాడు. రేకుల షెడ్ క్రింద ఎవరో నిల్చుని వున్నారు. వెన్నెల వెలుగు అక్కడ ప్రసరించడంలేదు. కాబట్టి సరిగ్గా కనపడటం లేదు.

దయాసాగరం దగ్గరగా వచ్చి అడిగాడు. "ఎవరండీ.."

కొద్ది క్షణాలు గడిచిన తర్వాత ఎవరి నుద్దేసించి అయితే తాను అడిగాడో వారినుంచి "నేను"అని మాత్రమే కోమలమైన సమాధానమొచ్చింది.

దయాసాగరానికి చిక్కునపడినట్లయింది. ఆమె స్త్రీ అయింది. లేకపోతే "క్షమించండి నేను పోల్చుకోలేదు మీారెవరో" అనగలిగేవాడు. కాని ఇప్పుడలా అనబుద్ధి పుట్టలేదు.

దయాసాగరం మళ్ళీ ఇంకా యేమీా ప్రశ్నించకుండానే విలంబన భరించలేని దానిలా కోమలంగా మళ్ళీ"నేనేనండీ...." అన్నది. దయాసాగరం కళ్ళు పెంచుకుని చూశాడు.

సింగుకి ఆశ్చర్యంగా వుంది.

ఎదుటి వ్యక్తికి బాగా కోపం వచ్చినట్లుగానూ, దిగులైనట్లుగానూ యేడుపు స్వరంతో సహా మేళవించి "సుగుణను" అన్నది.

దయాసాగరానికి ఆ రేకుల షెడ్డు పెళపెళ విరిగిపడ్డట్లు,

తూర్పుదిక్కున వెలుగుతున్న చంద్రుడు అమాంతం బంతిలా అయిపోయి తన చేతికివచ్చినట్లు చుక్కలు, తన నెత్తిన ఎవరో తలంబ్రాలుగా పోసినట్లూ, ఇంకా ఇంకా ఆశ్చర్యాలు వుక్కిరి బిక్కిరి చేశాయి.

దగ్గరగా వెళ్ళి పరిశీలించాడు.

ఆ ఆప్యాయతను గుండెల్లో భరించలేక ఎదుటవ్యక్తి చెయ్యిని వక్కసారిగా గట్టిగా పట్టుకుని 'నిజమే' అన్నాడు.

దానికి సమాధానంగా ఎదుట వ్యక్తినుండి జాజిపూల వాసనలాటి నవ్వు ఒకటి వచ్చింది.

"సుగుణా నువ్వా......."

"అవును నేనే....మన ఇంటికి పోదాం రండి."

పెద్దుదాటి వెన్నెల్లోకి వచ్చారు. సాగరం ఇంకా ఆమె చెయ్యిపట్టుకునే వున్నాడు.

"ఒక్కసారి ఆమెవేపు తిరిగి పరిశీలనగా చూశాడు.

ఆమె చిరునవ్వునవ్వింది.

ఒక్కత్తవే వచ్చావా సుగుణా...."అన్నాడు. ఎంతో భయపడి పోయినవాడిలా.

"అవన్నీ తరువాత చెపుతాను. ముందు మన ఇంటికి పోదాం" అన్నది ఆమె అలసటను సూచిస్తున్న మాటలతో.

ఆమెను ఇదివరలో యెప్పుడూ చూడనివాడిలా ఎంతో కొత్తవాడిలా ఒకే ఇదిగా చూశాడతను.

"ఏమిటలా చూస్తారు. ఇంటికి పోయిన తర్వాత చూడవచ్చును లెండి నేనో కాదో" అన్నదామె కోపంగా.

సింగుకి చెప్పలేని ఆశ్చర్యంగా వుంది.

ఏమిటో ఆనందంగానూ వుంది. అర్థమయ్యీ అర్థం గానట్లు వుంది.

"సింగూ...."అని పిల్చాడు దయాసాగరం.

"అయ్యా...."

"సత్యనారాయణగారి దగ్గరకెళ్ళి చెపుతావూ"

"ఏమని సామీ...."

దయాసాగరం ఆలోచిస్తున్నాడు.

"వాళ్ళావిడ యీబండికి వచ్చిందనీ.. ఇంటికి వెళ్ళాలి.. నువ్వొద్దులే నేనే చెపుతాను."

సింగుకి తెలిసి పోయింది. తెలియకుండానూ వుంది.

ఆమెవేపు భయంగానూ, అతడివేపు విస్మయంతోనూ చూస్తూ నిల్చుండి పోయాడు.

దయాసాగరం లోపలికి వచ్చాడు. సుగుణ వాకిలి వద్దనే నిలబడి పోయింది.

సత్యనారాయణగారన్నాడు "కనుక్కో. రైట్ తైమేనో కాదో."

దయాసాగరం చెప్పాడు ఇంటికి వెళ్ళాలని. సత్యనారాయణగారు వినిపించుకోలేదు.

"లేటా ఎంతలేటుట?"అని అడిగాడు. సింగు చెప్పాడు కల్పించుకొని.

"ఈ బండికి అమ్మగారు వచ్చారు. బయట నిల్చుని వున్నారు. సాగరంగారు ఇంటికి వెళ్ళాలట" అని.

సత్యనారాయణగారు వులిక్కిపడ్డాడు.

చిన్నగానవ్వి "ఇక నేం. చెప్పు." అన్నాడు.

దయాసాగరం సింగుని మెచ్చుకున్నాడు.

పోర్టిన్ వెళ్ళిపోగానే సింగునోసారి రమ్మని చెప్పాడు దయాసాగరం. ఇద్దరూ నడిచారు.

దారిలో సుగుణ చేతిలోని సంచి తీసుకున్నాడు దయాసాగరం. సుగుణ మళ్ళీ గుంజుకుంది.

రెండు నిముషాల్లో ఇల్లు వచ్చేసింది.

తాళంతీసి దీపం పెద్దది చేశాడు సాగరం. ఆవిడ ఇంకా వాకిలివద్దనే నిల్చునివుంది.

చెయ్యిపట్టుకుని నడిపించుకుని వచ్చి కుర్చీలో కూచో బెట్టాడు. ఆమె ఇల్లంతా కలయ జూసింది.

కూజాలోని మంచినీళ్ళు కాసిని వంచుకుని తాగింది.

దీపం బాగా పెద్దదిచేసి ముఖం దగ్గర యెత్తిపెట్టి కాసేపు చూసి చూసి నవ్వాడు దయాసాగరం.

ఆమెకూడానవ్వి, 'అనుమానం తీరిందా. నేను సుగుణనేనా" అంది.

ఆమె ముక్కుపట్టుకుని వూపుతూ "అదిసరే కాని ఇలా నన్ను కరుణించటంలోని అంతరార్థం ఏమిటో చెప్పు" అన్నాడు.

"మా బాగావుంది. నేను చాలా అలసిపోయాను. దయవుంచి నన్ను ఇప్పుడేమీ అడగవద్దు. నా కేడుపుకూడా వస్తుంది. నా కేమిటో ఏంజరుగుతున్నదోకూడా తెలీటంలేదు. నీళ్ళపొయ్యి చూపించండి. కాసిని నీళ్ళు కాగబెట్టుకుంటాను ముందు" అన్నది సుగుణ.

"నువ్విలానే కూచో, సింగు వస్తాడు ఇప్పుడు. స్టౌ వెలిగించి కాసిని పాలు కాస్తాను. సాయంకాలంపూట పాలు పోయించుకుంటానులే నేను" అన్నాడు.

"మీరేమైనా చేసుకోండి. నన్ను మాత్రం ఇప్పుడిప్పుడే యేమీ మాట్లాడించవద్దు" అన్నది సుగుణ.

నిజంగానే ఆమె అన్నట్లుగా ఆమెకేమిటో కొత్తగా వుంది. ఇదమిద్ధమని నిర్ణయించరాని సంచలనం రేగుతున్నది ఆమె హృదయంలో.

కిటికి ప్రక్కనేవున్న అరుగుమీద కటికనేలనే ఆమె వెనుకనే దిండూ, దుప్పటీ తీసుకుని ఆతడువచ్చి, "ఇది పరుచుకో సుగుణా" అన్నాడు. తలకింద దిండుమాత్రం పెట్టుకుంది ఆమె. అతణ్ణి వెళ్ళిపొమ్మన్నది. ఎంత సాహసం. అంతా నవ్వుకుంటారేమో అతన్నిచూసి. సిగ్గుచేటు. ఏమీకాదు. మంచిపనిచేసింది. ఇందులో సిగ్గుపడాల్సినదేముంటుంది." ఇలా ఆమె మనసు యేమిటేమిటో యోచింపసాగింది.

మధ్యమధ్య కళ్ళవెంబడి నీళ్ళుకూడా వస్తున్నాయి.

దయాసాగరం స్టౌ వెలిగించాడు.

పదినిముషాల తర్వాత పాలు పట్టుకొచ్చాడు.

ఆమె వద్దననూ లేదు. తీసుకోనూ లేదు. క్షణం తర్వాత యాంత్రికంగా ఆ పాలుకాసినీ తాగేసి మళ్ళీ పడుకుంది. దయాసాగరం మళ్ళీ స్టౌ వద్దకు వెళ్ళిపోయాడు. అతడికేమిటో భయంగా వుంది. సంతోషంగానూ వుంది.

అతడి ప్రతి కదలికనూ నీరసంగా ఆమె పరిశీలిస్తోంది.

స్టౌ మండుతూ చేస్తున్న ధ్వనీ, అ మంటలూ

హరికేన్ లాంతరముందు అతడు నిల్చున్నతీరూ, ఆమెకేమి టేమిటో ఆలోచనలు కలుగ చేస్తున్నాయి మధ్య మధ్య ట్రాకి గాలి కొడుతున్నాడతను.

సుగుణ కాసేపు అమ్మను గురించి ఆలోచించింది.

కాసేపు అత్తగారిని గురించి ఆలోచించింది.

ఇలా వచ్చేసిందేమిటితాను? పూనకంపూనినదానిలా!

ఎటువంటివిపరీత శక్తులు తననిలా ప్రోత్సహించాయి?

అమ్మ ఏమనుకుంటుంది.

ఇప్పుడుకాని దిగులు పడుతూంటుందా.

ఎప్పుడూ దిగులు పడదు.

అది ఆమె ప్రకృతికే విరుద్ధం.

అసలామెకు ఆలోచించగల శక్తిలేదు.

ఎదుటివారిని సానుభూతితో అర్థం చేసుకొన గల గుణం మృగ్యం. అసలు సానుభూంతఏ యేమిటో ఆమెకు తెలుస్తే కదా. సానుభూతే వుంటే కోడలితో రోజూ అంత పోరుతుందా. ఏమిటి తన ఆధిక్యత? పోనీ ఆధిక్యతే అను కుందాం. హద్దులు లేవా ? అనురాగంతో ఎంత ఆధిక్యతి నైనా నిల బెట్టుకొన వచ్చునే.

మళ్లీ తాను అమ్మ యెదుట పడితే యెలావుంటుంది.

అమ్మ తనని పలకరిస్తుందా?

ఇప్పుడు యేమనుకుంటుంది.

భయపడుతుంటుందా.

భయపడటానికి తానేమి చెప్పకుండా వచ్చేయ లేదుగా.

చెపితే అంతా హేళనా!

ఏం ఎందుకంత హేళన.

మొగుడిదగ్గరకు పోక ఎవరిదగ్గరకు పోతారు.

"తవ్వీ తలకెత్తుతాడు పో" అన్నది.

ఏమిటో అర్థంలేని మనిషి.

ఆమెకీ జన్మ కర్థంకాదు.

కొంతకొంతమంది మనుషులంతే. వాళ్ళకు బ్రతికుండగా అర్థంరాదు. అందుకనే నాన్న అంటుండేవాడు. "నేను కాబట్టి నీతో సంసారం చేశాను. ఇంకోడైతే సన్యాసం పుచ్చుకుని దేశాలమీద పోయేవాడు."

ఆయన బ్రతికుండగా ఆయన మాట - యెప్పుడు చెల్లింది కనక! ఎప్పుడూ అమ్మమాటే నెగ్గుతుండేది. ఏవిషయంలోనైనా ఆమెదే స్వయం నిర్ణయం. నాన్న కేవలం నిమిత్రమాత్రుడు. అన్నయ్యకు సంబంధం చేసేప్పుడు నాన్నగారికంత ఇష్టంలేదు. వేరే కారణాలు లేకపోయినా ఆయన ముభావంగా వుండిపోయినాడు.

అప్పుడు నాన్నని అడిగింది తాను.

ఆయన చెప్పారు. "మీ అమ్మకు అంతమేదకురాలైన కోడలు రాకూడదు. అప్పుడు లాభం వుండదు. మీ అమ్మంటే నాలుగాకులు యెక్కువచదివింది వస్తే అప్పుడు ఆట రక్తికడుతుంది."

ఆయన మాటలు విన్నప్పుడు తనకు నవ్వువచ్చింది.

నాన్న ఏమాత్రమూ సిగ్గుపడకుండా కనీసం చాటునైనా బయటపడిపోకుండా, అమ్మ అంటే భయం చూప

కుండా వుండేవాడు కాదు. అదేఆయన సుగుణం. అదే ఆయన బలహీనతకూడా.

సుగుణ కివాళ అన్నీ గుర్తొస్తున్నాయి.

నాన్న అనుకొన్నట్టుగా ఆ అమ్మేమంత మేదకు రాలేం కాదు. అవునో కాదో. అమ్మ తీసే స్వారికి ఎవరు మాత్రం కిమ్మనకుండా యెంతకాలం ఓర్పుతో భరిస్తారు? అందుకే ఇల్లు నరకంలా తయారయింది. పైన తానెందు కక్కడ వుంటున్నది ఇంకా? తన ఇల్లు వేరే చోటవున్నది.

ఈ భావనే రోజు మొత్తంమీద ఎన్నోసార్లు తన మదిలో మెదిలేది.

ధైర్యం చేసింది.

అందుకే పడలేక వచ్చేసింది. తన ఇంటికి. అవును. తన ఇంటికి తాను వచ్చింది.

తనకింక స్వేచ్ఛ. హాయి. ఎవరూ పట్టించుకోరు. ఎవరూ అడగరు. రణగొణధ్వనులుండవు. మనసుకి కష్టం వుండదు. తనఇల్లు. అని పదేపదే అనుకుంది సుగుణ.

కిటికీలోంచి వెన్నెలవచ్చి, అరుగుమీద పడుతోంది,

ఆమె దయాసాగరం వైపే చూస్తోంది.

అతడు బియ్యం కడుక్కొచ్చుకుంటున్నా, కూరతరుగుతున్నా వెళ్ళి అతడిచేతిలోని పనితీసుకుందామని తోచలేదు.

కాని అతడా పనులుపూర్తి చేసుకొన్నతర్వాత సిగ్గుపడేది. అతడూ మధ్యమధ్య ఆమెవేపు చూస్తున్నాడు.

సుగుణ లేచి కూచుంది. అతడివేపేచూస్తూ మండి

పోయే స్టవ్ అతడిముఖంమీద ఎర్రటికాంతి ప్రసరింపచేస్తు న్నది. హరికేన్ లాంతరు వెలుగులో సుగుణ అతణ్ణి కళ్ళు విప్పార్చుకుని చూసింది. జుట్టుముఖంమీద పడుతున్నది. ఫాలభాగాన చెమటి పోసింది.

ఆమె మెల్లగా అక్కడ నుంచి లేచి అతడి దగ్గరకు వెళ్ళి "మీరు లేవండి" అన్నది.

దయాసాగరం ఆమెవేపు వింతగా చూశాడు.

"మీరు వెళ్ళి అవతల కూచోండి. నేను దించుతాను" అన్నది.

"వద్దులే సుగుణా! నువ్వు అలసిపోయి వున్నావు" అన్నాడతడు.

దానికామె ఏమీ సమాధానం చెప్పలేదు. తనంత తానుగా పని కల్పించుకుంది.

దయాసాగరం బయట వాకిలి వద్దకు వచ్చి చూస్తూ నిల్చుండి పోయాడు.

ఆమె ఆలోచించింది. రోజూ ఇంతేకదా. ఇవాళ కదా! తానువచ్చింది. అందుకేచూడు పాపం ఎలా చిక్కి పోయారో అని తనకుతానే చెప్పుకుంది.

అన్నం దించేసి కూరగిన్నె ఎక్కిస్తున్నప్పుడు సింగు వచ్చాడు.

"కాసిని నీళ్ళు కాగబెట్టాలి సింగూ" అన్నాడు దయాసాగరం.

సింగు నీళ్ళహొయ్యి ముట్టించాడు.

ఆ పూట భోజనాని కిక్కడే వుండిపొమ్మ న్నాడు సింగుని దయాసాగరం.

సింగు వినలేదు. నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు.

చందమామ బాగా పైకివచ్చేశాడు.

వాళ్ళు భోజనానికి కూచున్నారు. కొద్ది చర్చతరు వాత ఒప్పందం కుదిరింది. ముందు అతడు భోంచేసింతర్వాత తాను కూచుంటా నంటుంది సుగుణ. కాదు తనతోనే కూచోవాలని అతడు.

ఆమె మౌనంగానే వింది. భోంచేస్తు న్నప్పుడూ మౌనంగానేవుంది. అతడొక్కడే మధ్యమధ్యనవ్వుకునేవాడు.

ఆమె ఆలోచించింది. రోజూ ఈ మనిషి ఒక్కరూ ఎలా భోంచేసేవారు అని.

ఎలా అయితేనేం ఒక్కమాట అడిగింది. "రోజూ మీకెలా తోచేదండీ. ఒంటరిగా యీ పాటప్పుడు వచ్చి స్టవ్ వెలిగించుకుని వంటచేసుకోవాలంటే".

దయాసాగరం నవ్వాడు, "నేను ఉత్తరాల్లో ఆ విషయం ఎప్పుడూ రాయలేదా నీకు ?" ఆమె సిగ్గుపడింది.

"ఇక పోతే ఎప్పుడూ నీ గురించే మనసంతా ఆలోచన"

ఆమె నమ్మలేనట్లు కొంటెగా చూసింది. అవును నీకేం తెలుస్తుంది. అదేదో సినిమా పాటవుంది చూడు. "కనులు మూసినకాని, కనులు తెరిచినకాని... అని, అలా వుండేది నాపరిస్థితి"

"ఎలా నమ్మమంటారు? ఏం? "మీరు వక్కసారైనా

వచ్చారూ ! అంత ఇదిగావుంటే మీరొచ్చినట్లయితే నేను వచ్చేసేదాన్నిగా. మీ కేంలెండి, మీరు హాయిగానే వుంటారు.."

దయాసాగరం కృత్రిమమైన కోపాన్నభినయిస్తూ "అవును ఉత్తరం వ్రాస్తే సమాధానం వ్రాయటం చేత కాదు. మాట్లాడుతావు ఎన్నైనా..."

ఆమె నవ్వి వూరుకుంది.

ఆమె భుజాన్ని అరచేతితో ఒత్తుతూ "ఇవాళ నా కెంత సంతోషంగావుందో తెలుసా ! ఈరోజునా బ్రతికున్నంతకాలం మరచిపోను.." అన్నాడు.

"ఉష్....ఏమిటి అల్లరి?" ఆమె కిటికీవేపు వేలెట్టి చూపెట్టింది.

దయాసాగరం వక్కసారి సిగ్గుపడ్డాడు. కిటికీలోకి చూశాడు. ఏమీలేదు. చందమామ నవ్వుతున్నాడు. ఆమె నవ్వింది. అతడూ నవ్వాడు.

అవాళ అతడిగుండెల్లో తలపెట్టి ఆమె చెప్పింది. తానెందుకు వచ్చేసిందీ. ఎందుకు రావలసివచ్చిందీ. దయాసాగరం వినీ విననట్లు విన్నాడు. విన్నా విననట్లుగానే వుంది. అతడి ఆత్మ, శరీరమూ తన్మయతకు లోనయినయ్. ఆమె ఎందుకు రావలసివచ్చిందీ అతడికవసరం లేదు.

ఆమె వచ్చింది అదేఅతడికిచాలు.

అతడి మనస్సు ఎక్కడోవుంది. స్వర్గంలోకాదు. ఆమే అతడిస్వర్గం!

అలసటతో ఆకాశంవేపు చూసేకన్నులు, భాషలేని

రహస్యాలు. ఎలా వెల్లడించాలి యింత ప్రేమ, ఇంత ఆర్ద్రత, బాధపడటాలు.

అతడు ఏమీ ఆలోచించలేదు. ఆమె ఎలావచ్చిందీ అతడు కనుక్కోదలచలేదు. ఆమె వచ్చింది. అదే చాలు అనుకున్నాడు పదేపదే.

"నేను చెప్పేది మీరు వినటంలేదు" అన్నదామె కొంతసేపటికి.

"వింటున్నాను" అన్నాడతను.

"అయితే మా అమ్మ ఏమన్నదన్నాను చెప్పండి చూదాం!" అన్నదామె.

"మీ అమ్మ ఏమన్నదీ నాకేం తెలుస్తుంది. పోనీ మరోసారి చెప్పు."

ఆమె చెప్పలేదు.

అతను అడగనూ లేదు.

అతడు పైకే అనేశాడు "నువ్వొచ్చావు ఇకనాకు వేరే ప్రసక్తి అవసరములేదు"

ఆమె పావురాయిలా గొణిగింది. "నేనువచ్చాను. అవును నేను వచ్చాను. రాక యేంచేస్తాను ?"

తెల్లవారింది. గదిలోపల ఉదయం నిండింది.

పక్షులు వాళ్ళను మేలుకొల్పాయి.

ఆమె పక్కమీదినుంచి లేస్తూనే అతణ్ణి అభ్యర్థించింది. అమ్మకీ అత్తయ్యగారికీ ఉత్తరాలు వ్రాసి పోస్టులో పడవెయ్యమని....

అతడు ఆమెవేపు చూసి నవ్వాడు.

ఆమె రోజుకు మొదలన్నట్లుగా అతణ్ణివెక్కిరించింది.

దయాసాగరం ఆవాళేఉత్తరాలు వ్రాసి పోస్టుచేశాడు.

సింగు వచ్చాడు పదిగంటలప్పుడు. బుట్ట నిండా కూరలు తీసికొని వచ్చాడు.

సుగుణ ఆశ్చర్యపోయింది.

"కమలమ్మగారు పంపించారమ్మా" అన్నాడు సింగు.

దయాసాగరం సింగుని అడిగాడు. "ఆయిన వంట్లో బావుందా''అని.

సింగు తలవూపి సింగు చెప్పాడు. "సాయంకాలం అమ్మగార్ని తీసుకుని మిమ్మల్ని ఒకసారి రమ్మన్నారు కమలమ్మగారు ... ఆయనగారుకూడా పదేపదే చెప్ప మన్నారు'' ...

దయాసాగరం గర్వంగా సుగుణవేపు చూశాడు సుగుణకి ఆనందంగా వుంది.

సాయంకాలం ఇద్దరూ కలిసి వెళ్ళారు.

అయితే సత్యనారాయణగారికి జ్వరంవచ్చి మంచం మీద వున్నాడు. సడన్‌గా వచ్చింది జ్వరం. స్టేషన్నుంచి రాగానే.

కమల సుగుణని ఆప్యాయంగా పలకరించింది. సుగుణ ఆమెతో మాట్లాడటానికే సిగ్గుపడింది. సత్యనారాయణగారు చెప్పాడు దయాసాగరానికి. "తాను ఒక నెలరోజులు సెలవు పెడుతున్నట్లు" ''అదే మంచిది" అన్నాడు దయాసాగరం. తర్వాతవాళ్ళు ఇంటికివచ్చేశారు.

# 8

కొత్త స్టేషన్ మాష్టరు వచ్చాడు. దయాసాగరానికి పనితగ్గిపోయింది. అంతపనీ ఆయనే చూసుకుంటున్నాడు. కారణం ఏమిటంటే ఆయనకు తాత్కాలికంగా ప్రమోషన్ ఇచ్చి పంపించారు. మళ్ళీ యీ కాలవ్యవధి కాగానే ఆయన పూర్వపు టుద్యోగంలోకే పోవాల్సివుంటుంది. అందుకని ఆయన వుబలాటం.

దయాసాగరం ప్రతిరోజూ సాయంకాలం పూట సత్యనారాయణగారింటికి వెళ్ళి వస్తూనే వున్నాడు. ఆయన యెంత చెప్పినా వినిపించుకోవటం లేదు. ఇక్కడనుంచి వెళ్ళి యెక్కడైనా మందుతీసుకోమంటే దయాసాగరం ఆ విషయాన్ని రోజూ అరగంట సేపు విశదంచేస్తునే వున్నాడాయనకు. కాని ఆయన సుముఖంగా లేదు. ఆయనలోని తలపుయేమిటో ఎవరికీ తెలీదు. ఆయన ఎవరికీ చెప్పడు. ఆయన ఎందుకిలా అయిపోతున్నదీ ఎవరికీ తెలియటంలేదు. ఆయన వ్యథ కేవలం శారీరకమైందే అనటానికేమీ ఆస్కారంలేదు. ఏదో మానసిక వ్యథ.

గుంటూరు వెళ్ళి మందుతీసుకోండి అని దయాసాగరం అన్నప్పుడు ఆయన "నాకేమిటయ్యా నిక్షేపంగా వున్నాను. కాకపోతే కాస్త విశ్రాంతి కావాలి. అందుకేగదా శెలవు పెట్టింది" అనేవాడు. దయాసాగరానికి ఏమంటానికి తోచేది కాదు.

అవును విశ్రాంతికావాలి. నిజమే! కాని అది ఏ రకమైన విశ్రాంతి? అనేదే అతడు ఆలోచించకుండా వున్నాడు.

అసలు నిజంగా సత్యనారాయణ గారికి జబ్బ కేవలం అసంతృప్తి. ఓ జీవితానికి ఒక లక్ష్యం అంటూ లేక పోవటం. ఏంచేయాలి, ఇంకా కొన్నాళ్లు బ్రతుకితేమాత్రం, తరువాత నిరామయంగా, నిరాలంబంగా బ్రతక వలసిందే కదా ! అధికమైన ఆలోచనతో భవిష్యజ్జీవితమనేది వట్టి యెడారి వంటిదనీ ఆయన గ్రహించగలిగాడు. అదే ఆయన సంతాపానికి ముఖ్యకారణం. తరువాత యీ మధ్య కొంత మంది పెద్ద మనుషులుచేరి, తనను వో మగపిల్లవాణ్ణి పెంచు కోమని సలహాలిస్తున్నారు అది తనబాగుకోరే చెబుతున్నా మని పెద్దపెట్టున అతడికి బోధపరుస్తున్నారు. అదికూడా మానసిక సంచలానికి కారణమైంది.

తను ఇన్నాళ్ళూ బాధావహమైన, జీవితాన్ని చిట్టిని చూసుకుని గడిపాడు. చిత్రంగా ఆమె పెరిగి పెద్దదై తన ముందే మారిపోయింది. ఆమెలోని ఒక్కొక్కమార్పు అత డికి ఆశ్చర్యంగొలుపు తుండేవి. చిన్నపిల్లగా వున్నప్పుడు ఆట పాటలతోటి, కాస్తకాస్త పెద్దదవుతున్నప్పుడు కథలు చెప్పి,తన తీరిక సమయాలలో తీరికలేకుండా చేసుకునేవాడు.

అప్పుడసలు ఏమీ ఆలోచించవలసిన పనే కన్పిం చేది కాదతనికి. ఒక రకమైన వ్యాపకంలాంటిది జీవితానికి స్పష్టంగా కన్పిస్తుండేది. ఎప్పుడైనా ఆలోచించ వలసివస్తే చిట్టి కెలా పెండ్లి చేయాలి? వరుడెలాంటివాణ్ణి తీసుకురావాలి ? యిత్యాది ఆలోచనలేతప్ప అన్యం ఏమీ ఆలోచించి ఎరు గడు. ఆ విషయంలో కూడా అతడెక్కువ శ్రమ తీసుకో వాల్సిన అవసరం లేక పోయింది. అక్కడే పనిచేస్తున్న

పి. డబ్ల్యు. డి. ఇంజనీరు ఆ సమస్యను అసలు సమస్యే కాద న్నట్లుగా విడగొట్టేశాడు. వాళ్ళు దంపతులు వచ్చీరాగానే తమ యింటికి వచ్చారు. పల్లెకొంపల్లో ఎట్లామరి. ఒకరితో ఒకరు పరిచయాలు చేసుకుని ఆ పరిచయాలు వృద్ధిపొందిం చుకొనకపోతే ప్రొద్దుపోవటం కూడా కష్టమే.

వాళ్ళు తమకెక్కడో దూరపు బంధువులని కూడా తేలింది. మాలతి మహాచురుకైన అమ్మాయి. ఆ అమ్మా యికి కమల వయస్సే వుంటుంది. రాగానే కమలతో బల వత్తరమైన పరిచయం ఏర్పడిపోయింది. అప్పుడప్పుడు మగ వాళ్ళు బయట కలుసుకుని మాట్లాడుకుంటుండేవారు. ఆడ వాళ్ళు మాత్రం రోజుకోసారైనా వీరింట్లోనో వారింట్లోనో సమావేశ మవుతుండేవారు.

సెలవులలో మాలతి తమ్ముడు రమణ వచ్చాడు. అతగాడు చదువేదో చదువుకొని ఉద్యోగం చెయ్యనంటూ ఎప్పుడూ పుస్తకాలు చదువుకుంటూనో, గోళ్లు గిల్లుకుం టూనో గడుపుతుండేవాడు.

అలాటిది మాలతి అతణ్ణి చిట్టిని చేసుకునేందుకు ఎలానో ఒప్పించింది. అవాళనుంచీ బరువూ బాధ్యతా అంతా తీరిపోయినట్లుగా ఆమె నిట్టూర్చింది. ఇవతల సత్య నారాయణగారుకూడా తన బాధ్యతను తాను నిర్వర్తించు కున్నట్లుగా తృప్తిపొందారు- పెండ్లి ఆవిధంగా జరిగిపోయింది.

తరువాత చిత్రంగా రమణమూర్తి అవ పడిన ఉద్యో గానికల్లా ఎప్లయిచేయటం నేర్చుకున్నాడు. అతడికి ఉద్యో గమూ వచ్చింది. వాళ్ళు వెళ్ళిపోయారు. సత్యనారాయణ

గారు పైకి ఏమీ అనకపోయినా మనసులో కమల కూడా వాళ్ళతోపాటు వెళ్ళిపోతుందనుకున్నాడు. ఆయన చాలా దిగులు పడ్డాడు. జీవితక్రమాన్ని ఎన్నోసార్లు సింహావలోకనం చేసుకున్నాడు.

కాని కమల వెళ్ళలేదు.

అందుకని ఎందుకు వెళ్ళలేదు. అని అతడుఆలోచించ లేదు. చిట్టి పెళ్ళికూడా ఏడెనిమిది నెలలు కావస్తున్నది. ఈ కాలవ్యవధిలో అతడి పేరిటఒక్క ఉత్తరంకూడా రాలేదు. ఒక్క ఉత్తరంకూడా చదవలేదు. ఇంజనీరు గారు ఎప్పుడైనా కనపడినప్పుడు ఆయనను అడిగితే ఆయన అంతే అనేవాడు. సత్యనారాయణగారికి ఆశ్చర్యమయ్యేది. కాని కమల పేరమాత్రం అప్పుడప్పుడు ఉత్తరాలు వస్తుండేవి. "అమ్మాయి ఉత్తరంవ్రాసింది" అని అప్పుడప్పుడు చెప్పేది. ఎప్పుడైనా మాలతి తమ ఇంటికొచ్చినప్పుడు వాళ్ళిద్దరూ ఉత్తరాలలో సంగతులే చర్చించుకుంటూ నవ్వుకుం టుండేవాళ్ళు. రమణమూర్తి వాళ్ళక్కకు ఉత్తరాలు వ్రాస్తూవుంటాడట. సత్యనారాయణగారు అతి జాగ్రత్తగా వాళ్ళ సంభాషణలను వింటుండేవాడు.

ఇప్పుడు మాలతికూడా లేదు. వాళ్ళు ట్రాన్సఫర్ వచ్చి వెళ్ళిపోయారు. ఎప్పుడైనా యీ మూణ్ణెల్లలో కమలకు మాలతి దగ్గర్నుంచే ఉత్తరాలు వస్తుండేవి.

ఎప్పుడైనా కమలవచ్చి తనతో అంటూ వుండేది "మాలతివద్దనుంచి ఉత్తరంవచ్చింది. అంతా కులాసా" అని. కొత్తస్టేషన్ మాస్టరు సంసారం తీసుకొచ్చుకోలేదు.

నెలరోజులుకాగానే సత్యనారాయణగారు ఇంకో నెలరోజులు సెలవుపొడిగించారు. దయాసాగరానికి ఇబ్బందైంది. కొత్త స్టేషన్ మేష్టరు ఎప్పుడూ తనతోనే వుండమంటున్నాడు దయాసాగరాన్ని. ఆయనకు ఏమీ తోచదు. ఎప్పుడూ సంసారాన్నిగురించో గడిచిన అనుభవాలగురించో ఎన్నెన్నో కథలు చెపుతుండేవాడు. దయాసాగరానికి వినటానికి ఓపిక లేకపోయినా ఆయన మాత్రం వదిలిపెట్టేవాడుకాదు.

దయాసాగరానికి ఆ పల్లెనుంచి బదిలీఅయితే బాగుం డుననిపిస్తున్నది. అతడు ట్రాన్సఫర్‌కు పెట్టుకున్నాడుకూడా. ప్రస్తుతం కాలం సుఖంగా సంతోషంగా తృప్తిగా గడిచి పోతున్నది. ఎప్పుడూ ఏవో నవ్వులూ, సరాగాలు, చిట్టిపొట్టి అలకలూ, మూతిబిగింపులూ-దయాసాగరానికి మరేవిధమైన దిగులూ చింతా లేకుండా గడచిపోతున్నది.

తాను వ్రాసిన రెండు ఉత్తరాలకూ తల్లివద్దనుంచే సమాధానం వచ్చింది. అత్తగారి వద్ద నుంచి సమాధానం కూడా రాలేదు. సుగుణ కాని, అతడు కాని అందుకుగాను ఏమీ నొచ్చుకోలేదు.

రైల్వే వాళ్ళు కట్టించిన క్వార్టర్సులో సుగుణ వెన్నెలలు పండిస్తున్నది. ఆ వెన్నెలలో విహరించే చకోరమతడు. అన్నిటికీ అతీతంగా వాళ్ళకు ప్రపంచంతో పనేమీలేదన్న ట్లుగా, రోజులు గడచిపోతున్నాయి. దయాసాగరానికి తల్లి మాత్రం ఉత్తరం వ్రాసింది. తాను అక్కడ పనులన్నీ చూసుకుని వస్తానని. దానికి దయాసాగరానికెలా సమాధానం వ్రాయాలో తోచలేదు. ట్రాన్స్ఫర్‌కోసం ప్రయత్నిస్తు

న్నానని తల్లికి వ్రాశాడు. సాయంకాలం "ష్రోట్రీన్" వెళ్ళి పోగానే ఇంటికి వచ్చేసరికి సుగుణ ఎదురుచూస్తూ వుంటుంది. కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేసేసరికి పది గంటలవుతుంది.

సింగు వస్తాడు. సింగు రోజూ సత్యనారాయణ గారింటివద్ద విశేషాలు వచ్చి చెపుతుంటాడు. ఈమధ్య నాలుగైదేసి రోజులు సత్యనారాయణ గారింటికి వెళ్ళటం కూడా పడటంలేదు దయాసాగరానికి. అందుకని సింగుని రాత్రిపూట రోజూవచ్చి ఆయన ఆరోగ్యం గురించిన వివరాలు చెప్పిపోవలసినదిగా కోరాడు దయాసాగరం. సింగు వస్తూనే వున్నాడు. సింగు ఎన్నెన్నో చిత్రమైన ముచ్చట్లు చెపుతాడు. తమాషా తమాషాకథలు చెపుతాడు. అతడు చెప్పే కథలు సుగుణకి నవ్వు తెప్పిస్తుంటాయి. వాళ్ళు తనని మెచ్చుకుంటుంటే ముసలాడికి మరీహుషారు.

యుద్ధంలో తాను పనిచేసినప్పటి చిత్రవిచిత్రమైన విశేషాలు, దేశదేశాల వింతలు చెపుతుండేవారు. ఆరోజుల్లో ధరలు ఎలావుండేవో, జంగంకథలు ఎంతబాగాపాడేవాళ్లో, మనుషులు ఎంతనీతిగా వుండేవాళ్ళో ఒకటేమిటి పొరపాటున పాముల గురించి ప్రశంసవచ్చి ఒకరోజు రెండుగంటలైంది సింగు లేచిపోయేసరికి దయ్యాల గురించి ఓరోజు ఏవో చెప్పబోతుంటే సుగుణ చెప్పనివ్వలేదు ఒకరోజు సింగు ఎందుకో రాలేదు. సుగుణ రెండుసార్లు అడిగింది దయాసాగరాన్ని అలా సింగు వాళ్ళకు ఆప్తుడిగా అతుక్కుని పోయేవాడు. ప్రతిరోజూ సాయంకాలంపూట స్టేషన్లోని ఎర్రగన్నేరు పూలూ, జాజిపూలూ తీసుకొచ్చి యిస్తుండేవాడు. సుగుణకు

ఒకరోజు సత్యనారాయణగారి కేదో మందు తీసుకుని రావ టానికి గుంటూరు వెళ్ళి వచ్చేటప్పుడు, కూరలూ, పండ్లూ బుట్ట నిండుగా తీసుకుని వచ్చాడు. దయాసాగరం డబ్బులివ్వ బోయినప్పుడు తీసుకో వాలో, తీసుకో కూడదో ఆలో చింపలేక బాధపడ్డాడు.

సుగుణ ఎప్పుడూ అతణ్ణి భోజనానికి రమ్మని పిలు స్తూనే వుంటుంది. కానిఅతడు ఒక్కసారి మాత్రమే వచ్చాడు. ముసలాడికళ్ళలో వుట్టినేనీళ్ళు తిరిగేవి. అతడి వూహాలు రెక్కలువిప్పుకుని బలహీనంగా, ఆవురావురు మంటూ, ఎన్నో నదులుదాటి, కొండలూ గుట్టలూదాటి, ఎన్నో వందలమైళ్ళు ప్రయాణంచేసి ఉత్తరదేశంలో పల్లె టూరు చేరుకునేవి. అదృష్టవంతులుఇలా జీవిస్తారుకాబోలు అనుకునేవాడు సింగు దయాసాగరాన్నీ, సుగుణనీ తలచుకుని. తన కూతురూ సుగుణ అంతవుంటుంది. అయితే ఆ మ్మాయి బాధ్యతను తానుసక్రమంగా నిర్వర్తించలేదు. ఇప్పుడెలా వుంటున్నదో -- సుఖంగా వుంటున్నదో లేక కష్టాలతో కాలాన్ని వెళ్ళదీస్తున్నదో -- ఏం? తనూ సంపాదించాడు. తనూ ఇన్నాళ్ళు బ్రతికాడు. తనకు ఒక్కగాని ఒక్కకూతురు. ఆ చిన్న జీవితాన్ని ఎందుకు సుఖవంతం చేయలేకపోయాడు? ఇంత దూరం నడిచివచ్చాక ఎప్పుడో దాటిపోయిన మజిలిలో పారేసుకున్న వస్తువుని గురించి ఆలోచించటం, వెర్రి అని సరిపెట్టుకునేవాడు.

సుగుణను చూసినపుడల్లా తనకూతురు మదిలో మెది లేది సింగుకు.

సింగుది పరిపూర్ణమైన జీవితం. అనుభవాలతో పరిపూర్ణత నింపుకుంది. కాలాన్నిచూసి ఎన్నో నేర్చుకున్నాడు. కాలం ఎన్నోముద్రలు అతడిమీదఅచ్చుగుద్దింది. ఎన్నెన్నో భయంకరమైన సంఘటనలు, ఎంతో నీచం, ఎంతో ఆనందం... అన్నీ అనుభవించాడతను.

ఇప్పుడు కల్మషం ఏమీలేదు. వృద్ధాప్యమేఅతడు.

అందుకని సుగుణ అంటే వాత్సల్యం. ఆమెకు ఎలాగైనా సహాయపడి, ఆమె సంతోష పడితే తాను సంతోష పడేవాడు. ఓ సారి రైల్లోనుంచి వంటచెరుకు తెప్పించాడు. దాన్నంతా చిన్న గొడ్డలి తీసుకుని చిన్న చిన్న పుల్లలుగా చేసి వంటింట్లో ముంగిట పేర్చిపెట్టాడు. సుగుణ ఆరోజు సింగు ని ఎంతో మెచ్చుకుంది. సింగుసంతోషపడ్డాడు. సత్యన్నారాయణగారింటికి, దయాసాగరం క్వార్టర్సుకీ ఎప్పుడూ తిరుగుతూ వుండేవాడు సింగు. ఎప్పుడేనా సుగుణ అక్కడికి వెళ్ళవలసి వుంటే తీసుకెళ్ళి మళ్ళీ ఇంటిదాకా దిగబెట్టి పొయ్యేవాడు. ఆవాళ దయాసాగరం ఇంటికి వచ్చేసరికి సుగుణ ఇంట్లోలేదు. ఆతడికి అశ్చర్యమైంది. సాయంకాలం సత్యనారాయణగారింటికి వెళ్ళిందని అతడికి తెలిసింది. సింగువచ్చి చెప్పాడు. ఏడూ పదిహేనుకి బండివెళ్ళి పోగానే సింగు మళ్ళీ సత్యనారాయణగారింటికి వెళ్ళాడు. మళ్ళీ ఫోర్టన్ వచ్చేముందు వచ్చి తనపని తాను చూసుకున్నాడు. అప్పుడు తన కేమీ చెప్పలేదు. తానుఅడగలేదు. ఫోర్టన్ వచ్చి వెళ్ళిపోగానే త్వరత్వరగా వెళ్ళిపోయాడు సింగు.

దయాసాగరం నేరుగా సత్యనారాయణ గారింటికి వెళ్ళాడు. అక్కడ సుగుణవుంది. బయటనే సింగు కన్పించాడు. ఆదుర్దాగా అయ్యగారికేమీ బాగులేదని చెప్పాడు. దయాసాగరం లోపలికివెళ్ళి చూశాడు. హరికేన్ దీపపు వెల్తురులో ఆయన ప్రశాంతంగా నిద్రపోతున్నారు. ముఖం పీక్కుపోయి, మరీ గెడ్డం బాగా పెరిగి వుండటంవలన, జబ్బ వలనపూర్తిగా రోగలక్షణాలు ఆక్రమించుకున్నాయి. వీళ్ళు ఎందుకింత గాభరా పడుతున్నారు? అనుకున్నాడు దయా సాగరం. సుగుణ మాట్లాడకుండా ఒక మూలకూచునివుంది. కమలమాత్రం ఆయన మంచం వద్దనే కూచునివుంది. ఆమె చాలా యేడ్చి వుంటుందని ఆమెమొహం స్పష్టం చేస్తున్నది.

దయాసాగరం అడిగాడు ఎలావుంది? అని. దానికి గొంతునిండుకరాగా, కమల సమాధానం చెప్పింది, "ఏం చెప్పేది, ఇవాళ ప్రొద్దుటనుంచీ పిచ్చిపిచ్చిగా నవ్వటం వెర్రిగా కేకలూ, కలవరింతలూ, నాకు భయమేస్తున్నది. నేనిక్కడ వుండలేను". ఆమె స్వరం యేడుపుకి మొదట మెట్టు.

కొద్దిగా తమాయించుమని "అవును నాకేమిటో భయంగా వుంది. నేనొక్కదాన్ని వుండలేను. భగవంతుడు నా మొహాన అన్నీ కష్టాలే వ్రాసి పెట్టాడా? ఇకనైనా నేను కోలుకోలేను కాబోలు. అయ్యో... ప్రొద్దున సింగుని పంపించి, యీవూళ్ళో ఎవరో ఆచారి వున్నారట. ఆయన్ని పిలిపించాను. సన్నిపాతంలోకి దించుతుందనీ, ఇంకా ఏమేమో చెప్పిపోయినాడు. అన్నయ్య

వినిపించుకుంటేనా, అప్పుడే ఏ గుంటూరో, బెజవాడో వెళ్ళి వుంటే బావుండేది. ఇప్పుడు యీయన్ని కదిలించటమెలా. నేనేం చేయగలను. ఇంతదాకా వచ్చిందే, ఎలా తీసుక వెళ్ళాలి. ఏ హాస్పిటల్‌లో చేర్చాలి...." కమల తనలోతాను మాట్లాడుకుంటున్నట్లుగా ఏమేమో అనుకోసాగింది. దయా సాగరం—స్థబ్ధుడిగా నిలబడిపోయినాడు.

కమల చెప్పింది. "ఇవాళ మాలతికి ఉత్తరం వ్రాశాను. వాళ్ళు యెల్లుండైనా వస్తారో లేదో....మీరు అమ్మాయికి ఓ కెలి గామ్ ఇవ్వండి...." అన్నది.

దయాసాగరం తల వూపాడు.

సత్యనారాయణగారు కళ్ళు తెరిచి దయాసాగరం వేపు చూసి"పోర్టీన్ రైట్ టైముకి వచ్చిందీ" అని అడిగాడు. మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు.

దయాసాగరాని కెలా పలుకరించాలో తోచలేదు.

"ఇదే ధోరణి చూస్తుంటే నా గుండె బ్రద్దలవుతున్నది. నేను ఒకర్తిదాన్ని ఎలా కనిపెట్టుకుని వుండాలి. ఎలా భరించాలి." అన్నది కమల.

ఆమె ప్రతిమాటలోనూ, ఒంటరిదాన్ని ఒంటరిదాన్ని అని భయపడిపోవటం గమనించాడు దయాసాగరం. ఎలా ఓదార్చాలో అతడికి తెలియకుండా వుంది.

కమల కాసేపువుండి అప్పుడే తెలివొచ్చిన దానిలా సుగుణవేపు తిరిగి "మీరు వెళ్ళండి పాపం, చాలాసేపు కూచున్నారు. అయితే మళ్ళీ వస్తారా-సింగు చేత కబురంపిస్తాను." అన్నది.

సుగుణ తల వూపింది. "ఏం ఫరవాలేదండీ. ఆయన బాగా తెలివిగానే వున్నారు." అన్నది సుగుణ

"అవును కాని హఠాత్తుగా ఏవేవో పిచ్చి మాటలు. "

"నేను మళ్ళీవస్తాను" అని చెప్పింది సుగుణ.

సింగు వెంట రాబోతుంటే దయాసాగరం వద్దన్నాడు.

దారిలో సుగుణ అంది "పాపం ఆమె పొద్దుటనుంచీ పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టలేదు."

దయాసాగరం విచలితు డైనాడు.

"ఏం ఎందుకని? నీ కెలా తెలుసు?" అని అడిగాడు.

"దీనికి సమాధానం ఎవరు చెపుతారండి — నాకు తెలియటమంటారా . ఎవరికైనా తెలుస్తూంది..." అన్నది.

"మరి ఎలా.... ?" అన్నాడు దయాసాగరం.

"ఇప్పుడు మళ్ళీ నేను వెళ్ళి బ్రతిమాలో, బామాల ఇంత ఎంగిలి చేయిస్తాను...." అన్నది.

"మళ్ళీ నువ్వు వెళ్తావా ?"

"అవును ఏం, మీరూ రండి. పాపం ఆమె చాలా భయపడి పోతున్నది" అన్నది సుగుణ.

"అవును...." అన్నాడు దయాసాగరం పొడిగా.

"పాపం ఎలానండీ, ఆమె కింకెవరూ లేరా, ఆ కూతురు తప్ప..."

"బహుశా ఎవరూ లేరనుకుంటాను. అయినా నాకు తెలీదు..."

"ఎవరూ లేరటండీ పాపం... ఎంత దురదృష్టం, పాపం మధ్య మధ్య ఆ విషయాలన్నీ చెప్తుతుంది. ఈ యన గారిభార్య యీాయనతో పడక ఎక్కడికో పోయి వుంటుందిట. ఆమెకి వీళ్ళు డబ్బుకూడా కడుతున్నా రట. ఆమెకూడా తెలియపరుద్దామా అంటోంది. ఇప్పటి కైనా మళ్ళీ ఏమైనా కుదుట పడవచ్చునని ఆమె ఆశ. కాని అన్నగారికి చెప్పలేదు. అన్నగారిని అడగలేదు. పోనీ లెండి, ఇంకా ఆ పాపిష్టి ఘటం వస్తేనేం, గిస్తేనేం.... ఆ అమ్మాయికి మాత్రం మీరు ప్రొద్దున్నే టెలిగ్రాం ఇవ్వండి. వాళ్ళు బాగా దూరంగానే వుంటున్నారే. ఎక్కడా, కలకత్తా లోనా..." సుగుణ ఇలానే ఏదేదో మాట్లాడేస్తున్నది. దయాసాగరం వినిపించుకొనివినిపించుకోనట్లు నడుస్తున్నాడు. అతడి మనసునిండా ఏమిటేమిటో ఆలోచనలు రేగుతు న్నాయి. చాలా చెడ్డ చెడ్డ ఆలోచనలు వస్తున్నాయి. సత్యనారాయణగారికినయమవుతుందా-కమల గతేంకానూ.,

ఇల్లు వచ్చేసింది. సుగుణ మరేమీ మాట్లాడలేదు. దయాసాగరం లోపలి అరుగుమీాద మౌనంగా కూచుండి పోయాడు. అరగంటలో సుగుణ వచ్చి పిలిచింది. ఒకే సారి కూచుని భోజనంచేసిన తర్వాత సుగుణ గిన్నెల్లో అన్నమూ అదీ సర్దుకుంది. ఇద్దరూ కలసి సత్యనారాయణ గారింటికి వెళ్ళారు. కమల అలానే కూచుంది. సత్యనారా యణగారు మాత్రం సింగుతోటి ఏదో మాట్లాడుతున్నాడు.

దయాసాగరానికి సంతోషమైంది. ఈసారి "రావోయ్

కూచో" అని దయాసాగరాన్నికూడా ఆహ్వానించారాయన సింగు నేను ఇప్పుడే వస్తానని చెప్పివెళ్ళాడు.

సత్యనారాయణగారు బలహీనంగానవ్వుతూ "ఇవాళ నేను చాలా గాభరా పెట్టానుట. బాగా పైత్యంచేసివుంటుంది. అసలు నాబళ్ళు నాకు తెలిస్తేగదా" అన్నాడు.

"ఇక తాత్సారం చెయ్యవద్దు. నేనువచ్చి మిమ్మల్ని హాస్పిటల్‌లో జాయిన్ చేయిస్తాను!" అన్నాడు దయాసాగరం.

"నాకు తెలియదటోయ్ పిచ్చివాణ్ణా. చూడు. హాస్పిటల్‌లో చేరడమంటే రెండు మూడొందలన్నా వుండాలి. వూళ్ళో మళ్ళీ ఇల్లుతీసుకోవాలి. ఇప్పుడు నేను వుట్టి చేతులతో వున్నాను. ఇప్పుడేం చిట్టి పెళ్ళిచేసినప్పటినుంచీ నేను వుట్టి చేతులతోనే వున్నాను." అన్నాడు.

దయాసాగరం సిగ్గుపడ్డాడు. ఆయన కెలాసమాధానం చెప్పటమో అతడికి తోచలేదు. మౌనంగా వుండటంకన్నా శరణ్యం కన్పించలేదు. అయినా కొద్దిసేపాగి "అలా అని వూరుకుంటామా యేమిటి ? ఎలానైనా వెళ్ళాల్సిందే" అన్నాడు. లోపలనుంచి సుగుణ కమలను బ్రతిమాలటం విన్నాడు. సత్యనారాయణగారు బాధ పడటం మొదలైంది. "చూడు నే నెలా కష్టపెడుతున్నానో కమలను..." అన్నాడు.

ఎలాగైతేనేం సుగుణ గెలిచింది. ఇంతలో సింగు వచ్చాడు.

చాలా "పొద్దుపోయిందయ్యా మీరు వెళ్ళండి..." అన్నాడు సింగు.

"ఫరవాలేదులే..." అన్నాడు దయాసాగరం.

సత్యనారాయణగారు, "ఏమిటి ఫరవా, వెళ్ళండి. నాకేం ఫరవాలేదులే. అయినా సింగు వుంటున్నాడుగా. పాపం, ఆ అమ్మాయికికూడా శ్రమయెక్కువైంది నావలన. ఇందాక కమల చెప్పింది..." అన్నాడు.

ఆ అమ్మాయి అని ఎవరిని గురించి అంటున్నాడో దయాసాగరానికి తెలియకపోలేదు. ఆయన అలా అంటున్నప్పుడు ఆయనగొంతులో జాలీ, వాత్సల్యం నిండుకొచ్చింది.

దారిలో సుగుణ అన్నది. "నయమే ఆయనకు తెలివచ్చేసింది కాని... ఏమోనమ్మలేం మనము. ప్రొద్దున్నే టెలిగ్రాం మాత్రం ఇవ్వవలసిందేనని చెప్పింది ఆమె.--ఇదుగో డబ్బుకూడా నాచేతికిఇచ్చిం"

"ఎందుకు తీసుకున్నావు సుగుణా, తరువాత తీసుకుంటే సరిపోయేది కదా" అన్నాడు సాగరం.

"ఆమె నాచేతిలో పెట్టింది." అన్నదిసుగుణ.

"ఆయన డబ్బులేదని మీతో చెప్పటం ఆమె విన్నది పాపం...." అన్నది సుగుణ. మధ్యలో వాళ్ళుఏమీ మాట్లాడుకోలేదు. ఆరాత్రి వాళ్ళుపడుకునేసరికి పన్నెండు గంటలైంది. ప్రొద్దున్నే దయాసాగరం వినుకొండ వెళ్ళి టెలిగ్రాం ఇచ్చి

వచ్చాడు. వచ్చేసరికి మధ్యాహ్నం వంటిగంటైంది. రాగానే వచ్చిన దృశ్యాన్నిచూసి తననుతాను నమ్మలేకపోయినాడు. సింగువరండాలో కూచుని కళ్ళనీళ్లు పెట్టుకుంటున్నాడు. సుగుణ అతణ్ణి ఓదారుస్తోంది. అతడి గుండెలు గుబగుబలాడి నయ్. దయాసాగరాన్ని చూడగానే సింగు కళ్ళవెంట నీళ్ళు ఇంకా యెక్కువైనాయ్. దయాసాగరం లోపలకురాగానే "యేమిటి? యేమిటి?" అని సుగుణని అడిగాడు.

సుగుణ చెప్పింది "సింగుకి వాళ్ళ వూరినుంచి ఉత్తరం వచ్చిందట. కూతురు చాలాజబ్బుతోవుందట. చూడదలచుకుంటే వెంటనే వచ్చెసెయ్ అని, ఉత్తరం వ్రాసికూడా నాలుగురోజులైంది. అది తలచుకుని సింగు యేడుస్తున్నాడు."

దయాసాగరానికి సింగుపైన యెనలేని జాలి కలిగింది.

"ఏం ఫరవాలేదులే" అని అతణ్ణి ఓదార్చాడు.

సాయంకాలం సింగు సుగుణతో ఇలా అన్నాడు. "మళ్ళీ తిరిగి వస్తాననిపించటం లేదు. ఏమిటో నా మనసలా చెపుతున్నది తల్లీ.... నేను మళ్ళీ రాను...." సింగు కళ్ళు తుడుచుకున్నాడు.

"వస్తావు. నేను చెపుతున్నానుగా.—మీ అమ్మాయి కేం ఫరవాలేదు. నామాట నమ్మకపోతే అప్పుడడుగు గాని"

"ఏమో నీమాట చలువ తల్లీ...." అన్నాడు సింగు.

"అయినా ఎప్పటికో ఎన్నాళ్ళకో, సాగరం గారికి బదిలీ అవుతుంది. ఇంకొద్ది రోజుల్లోనే సత్యనారాయణగారు

ఎక్కడకు వెళతారో ఏమిటో....అయినా నేను ఇకరాను"

సింగు ఆవాళంతా వూరంతా పిచ్చిపట్టినవాడిలా తిరిగాడు. సత్యనారాయణగారి కాళ్ళు కళ్ళకద్దుకున్నాడు. అవపడిన వాళ్ళందరికీ నమస్కారాలు పెట్టాడు. సింగు వెళ్ళిపోతున్నందుకు కమల యేడ్చింది. ఏనాటి అనుబంధం ఇది! అనుకుంది.

"ఫోర్టిన్"లో సింగు వెళ్ళాడు. రైలుకదిలిపోతుంటే అతడికళ్ళనిండా నీళ్ళు తిరిగినయ్. దయాసాగరం చేతులు పట్టుకుని "ఇకరాను బాబూ" అన్నాడు. రైలు కనబడినంత దూరమూ దయాసాగరం అలాగే చూస్తూ, నిల్చుండిపోయాడు.

రాత్రి సుగుణ చెప్పింది. "సింగు ఎంతమంచివాడో చూశారా. సత్యనారాయణగారు వందరూపాయలివ్వాలి సింగుకి. అడగలేదు. కమలమ్మగారు చెప్పి యేడ్చింది పాపం ... "

దయాసాగరం విస్తుపోయాడు. తాను యీవూరొచ్చినప్పటినుంచీ సింగుతో పరిచయం నెమరు వేసుకున్నాడు. సింగు లేనిలోటుకి అందరూ విచారించారు.

మర్రోజు సత్యనారాయణగారు మళ్ళీ గొడవ చేశారు. ఎవరో కుర్రవాడు పరుగెత్తుకుంటూ స్టేషనుకువచ్చి దయాసాగరాన్ని పిలుచుకుని పోయినాడు. సుగుణకూడా అక్కడేవుంది. మాలతి, ఆమె మగడూ వచ్చారు. సత్యనారాయణగారి ఒళ్ళు సలసల కాగిపోతోంది. మధ్య మధ్యఏమి

ఏమిటో పిచ్చిపిచ్చి కేకలు. దయాసాగరం ఆచారిని పిలుచు
ొచ్చాడు. మళ్లీ వెంటనే స్టేషనుకి వెళ్ళిపోయాడు. సింగు
చేయాల్సిన పనికూడా ఇవాళ అతనే చేయాల్సివచ్చింది.
అతడికి చెప్పలేని దిగులుగా వుంది. పోర్టర్ వెళ్ళిపోయిన
తర్వాత సత్యనారాయణగారింటికి వెళ్ళాడు దయాసాగరం.
సుగుణ అప్పటికే ఇంటి కెళ్ళిపోయింది. మళ్ళీ ఆయనకు
ఇప్పుడుకాస్త నెమ్మదిగా వుంది. దయాసాగరం ఇంటికి
వచ్చేశాడు. మర్రోజు చిట్టివచ్చింది మొగిడితోసహా, ఇంట్లో
వాళ్ళందరి ముఖాలూ వికసించాయి. సత్యనారాయణగారు
రాత్రినుంచీ కన్ను తెరవనేలేదు. దయాసాగరం వినుకొండ
వెళ్ళి ఒక డాక్టరుని పిలుచుకుని వచ్చాడు. ఆయన ఫరవాలేదు
అని చెప్పాడు. రెండుఇంజెక్షన్లుచేసినా సత్యనారాయణగారికి
తెలివి రాలేదు. డాక్టరు సాయంకాలనికి మళ్ళీ వస్తానని
వెళ్ళిపోయాడు బండిలో.

కమలకు ప్రాణం కుదుటపడింది.

రమణమూర్తి ఏమీ దిగులూగిగులూ పెట్టుకోకుండా
కులాసాగా, అక్కతోనూ, బావతోనూ ఏవేవోకబుర్లు
చెపుతూ ఆడుగుతున్నాడు. చిట్టిమాత్రం క్షణంకూడా విడు
వకుండా మామయ్య మంచంప్రక్కనే కూర్చొని వుంది.

సాయంకాలానికి ఆయనకు తెలివొచ్చింది. చిట్టి
వచ్చిందని కమలవచ్చి చెప్పిందాకా ఆయన తెలుసుకోలేక
పోయినాడు. చిట్టిచెయ్యి తనచేతిలోకి తీసుకుని నిమురుతూ

"వచ్చావా తల్లీ" అనిమాత్రం అనగలిగాడు. చిట్టి దుఃఖాన్ని ఆపుకుంటూ ఇంట్లోకి వెళ్ళిపోయింది. ఆయన అప్పటినుంచీ తెలివిగానే వున్నాడు. చీకటి పడుతుండగా రమణమూర్తి దయాసాగరంతో కలసి స్టేషనువేపు వెళ్ళాడు. మాలతి సుగుణ వాళ్ళింటికి వెళ్ళి వస్తానని వెళ్ళింది. ఇంట్లో వాళ్ళే మిగిలారు. కమల చెప్పింది. "చిట్టి లేవలేకుండా వుంది అన్నయ్యా. ఇంకా ఏడెనిమిది నెలలకుగాని మనని విడిచిపెట్టి పోదు. అతడు యీ వేపుకే ఉద్యోగం మార్పించుకుందామని కూడా ఆలోచిస్తున్నాడట''. సత్యనారాయణగారికి లోపల ఆనందం పెల్లుబికింది. జాడ్యమంతా వదలిపోయినట్లయింది. ప్రయత్నించి లేచి కూచున్నాడు. తూరుపుదిక్కున కిటికీ లోంచి ఉదయించిన చందమామ కనిపించాడాయనకు. ఆయన నిట్టూర్చాడు.

(సమాప్తం)



# ప్రసిద్ధ తెలుగు నవలలు



| | | |
|---|---|---|
| ఆత్మజ్యోతి | కొ. వేణుగోపాలరావు | రు. 5-00 |
| శారద | ,, | 3-00 |
| జాలి లేని జాబిలి | ,, | 4-00 |
| కీలుబొమ్మలు | డా॥ జి. వి. కృష్ణారావు | 5-00 |
| అంతర్వాహిని | హితశ్రీ | 3-00 |
| ప్రపంచమార్గం | మంజుశ్రీ | 1-50 |
| చీకటి తెరలు | ,, | 2-00 |
| కనువిప్పు | కొత్త లక్ష్మీరఘురామ్ | 1-50 |

ప్రతులకు

## నవభారత్ బుక్ హౌస్

పబ్లిషర్సు అండ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు

ఏలూరు రోడ్డు :: విజయవాడ-2